347



సాహిత్య మాసపత్రిక



* ఏ. సూర్యప్రకాశ్
* శ్రీ కాట్రగడ్డ
* కీర్తి నాగరాజు
* సోమసుందర్
* చాగంరెడ్డి నరసింహారెడ్డి
* కొండిపర్తి శేషగిరిరావు
* ఎమ్. జయజీవితరాజు
* కొంగే సుధాకరరావు
* వల్లంపాటి వెంకట సుబ్బయ్య
* ఎమ్ పార్వతీశం
* డా॥ హెచ్. యస్. బ్రహ్మానంద



ది. 29-8 82న విజయవాడలోని హిందీ ప్రచార విద్యాలయం ప్రారంభోత్సవం
సందర్భంగా శ్రీ వేమూరి రాధాకృష్ణమూర్తి, ప్రధాన కార్యదర్శి, ద.భా.
హిందీ ప్రచార సభ, మద్రాసుగారితో తీయబడిన ఛాయా చిత్రం.
క్రొత్తగా నిర్మించిన ప్రచారక విద్యార్థినుల వసతిగృహంపై
తీయబడినది.




సాహిత్య మాస పత్రిక

# 347

ఫిబ్రవరి 1983

వార్షిక చందా : పది రూపాయిలు

సంపాదకులు :

డా. సి. నారాయణరెడ్డి

వేమూరి ఆంజనేయశర్మ

చిర్రావూరి సుబ్రహ్మణ్యం

# ఈ సంచికలో


యుగ సంగీతం ఏ. సూర్యప్రకాశ్

మృతక జీవితం శ్రీ కాట్రగడ్డ

రెండు కవితలు కీర్తి నాగరాజు

పుడమి గుండెలు సోమసుందర్

అనుభూతి రథం

ఆలోచనాశ్వాలు చాగంరెడ్డి నరసింహారెడ్డి

సుందర కళా జగత్తులో

ఆభాసా లక్షణం — కొండిపర్తి శేషగిరిరావు

అబ్బూరివారి మల్లికాంబ — యమ్. జయజీవితరాజు

బాపూ స్మృతి — కొంగే సుధాకరరావు

కథాంగాలు-ఒక పరిశీలన — వల్లంపాటి వెంకటసుబ్బయ్య

తీర్థంలో స్వార్థం — ఎమ్. పార్వతీశం

ఆధునిక తెలుగు సాహిత్య విమర

సాంప్రదాయిక రీతి — డా॥ హెచ్. యస్. బ్రహ్మానంద

సాహిత్య గోష్ఠి

సమీక్షలు

వార్తలు - విశేషాలు




# ఆంధ్రప్రదేశ్ నూతన ప్రభుత్వం-భాషా విధానం

1983 జనవరి 5 వ తేదీన ఆంధ్రప్రదేశ్, కర్నాటక రాష్ట్రాల శాసనసభలకు జరిగిన ఎన్నికలలో స్వాతంత్ర్యానంతరం మొదటిసారిగా కాంగ్రెసేతర పార్టీలు విజయం సాధించి అధికారంలోకి వచ్చాయి. ఈ రెండిటిలోను ఆంధ్రప్రదేశ్‌లో 'తెలుగుదేశం' పార్టీ విజయాన్ని ప్రత్యేకంగా పేర్కొనాలి. కేవలం 9 నెలల వయస్సులో ఈ పార్టీ సాధించిన విజయం ఆశ్చర్యం కొల్పేదిగా ఉన్నది. ఈ పార్టీ సంస్థాపకులు, అధ్యక్షులు అయిన శ్రీ ఎన్. టి. రామారావుగారికి గల ప్రజాభిమానం, ఇంతకాలంగా ప్రభుత్వ నిర్వహణ కావించిన పార్టీ అంతఃకలహాలు, ఇంకా ఇతర అనేక కారణాలు తోడుకాగా ప్రజాభిప్రాయాన్ని ప్రభావితం చేసి ఈ అద్భుత పరిణామాన్ని కల్గించింది. తెలుగుదేశం పార్టీ విజయాన్ని సాధించి శ్రీ ఎన్. టి. రామారావుగారి నాయకత్వాన ప్రభుత్వాన్ని స్థాపించింది. ఈ ప్రభుత్వం విజయవంతం కావాలని ఆకాంక్షిస్తున్నాము.

రాష్ట్రంలో తెలుగుకు సముచిత స్థానం కల్పించడం తెలుగుదేశం పార్టీ ప్రధానాశయాలలో ఒకటిగా చెప్పబడింది. పరిపాలనాస్థాయి లన్నిటిలోను తెలుగును ప్రవేశపెడతామని ఆ పార్టీ చెప్పింది. నూతన ప్రభుత్వం ఏర్పడిన తరువాత గౌ॥ ముఖ్యమంత్రి ఈ విషయాన్ని పునరుద్ఘాటించారు. తెలుగుకు సంబంధించి ఈ ప్రభుత్వ విధానం బహుధా అభినందనీయం.

దక్షిణ భారత హిందీ ప్రచార సభ - ఆంధ్ర మొదటి నుండి రాష్ట్రస్థాయిలో తెలుగు, జాతీయ స్థాయిలో హిందీ-అన్న విధానాన్ని అవలంబించి ఉన్నది. ఈ విధానం కారణంగా సభ అఖిల భారత స్థాయిలో రాజభాషా సమ్మేళనాలు నిర్వహించడంలోను, రాష్ట్ర స్థాయిలో అధికార భాషా సదస్సులు నిర్వహించి ఉద్యమం నడపటంలోను ముందుండి సహకరిస్తూ వచ్చింది. రాష్ట్రంలో తెలుగుకు సముచిత స్థానం సంపాదించడానికి 'స్రవంతి' పత్రిక ద్వారా ఎంతో కృషి చేసింది. 1973 లో దక్షిణ భారత హిందీ ప్రచార సభ తీసుకున్న చొరవ కారణంగా ఏలూరు, కర్నూలు, చిత్తూరు, మహబూబ్‌నగర్‌లలో జిల్లా స్థాయి అధికార భాషా సదస్సులు, 1974 లో హైదరాబాదులో రాష్ట్ర స్థాయి అధికార భాషా సదస్సు జరిగి ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం ద్వారా అధికార భాషా సంఘం (అఫిషియల్ లాంగ్వేజ్ కమిషన్) ఏర్పాటయింది.

ఈ అధికార భాషా సంఘానికి అధ్యక్షులుగా మొదట శ్రీవావిలాల గోపాలకృష్ణయ్యగారు, తరువాత శ్రీ వందేమాతరం రామచంద్రరావుగారు, ప్రస్తుతం డా॥ సి. నారాయణ రెడ్డిగారు ఉన్నారు. ఈ సంఘం పక్షాన అధికారులను కలుసుకొని తెలుగులో పరిపాలనా వ్యవహారాలను జరుపుమని కోరడం జరుగుతోంది. పంచాయితీలు, జిల్లా పరిషత్తులు క్రింది స్థాయిలో కొంతపని జరుగుతున్నా పై స్థాయిలో ప్రోత్సాహకరంగా లేదు. ప్రభుత్వ శాసనాల అనువాదాల అచ్చు విషయం చాల నిరాశాజనకంగా ఉన్నది. 60 వరకు కేంద్ర ప్రభుత్వ

శాసనాలు తెలుగులోకి అనూదితాలయి అచ్చుకాకుండా ఉన్నవని తెలుస్తోంది. వాటి అచ్చుకు ఆర్థిక వ్యయం కేంద్ర ప్రభుత్వమే భరిస్తుంది. ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ శాసనాలు కూడ కొన్ని తెలుగులోకి వచ్చాయి. కాని అవి కూడ పెద్ద సంఖ్యలో అచ్చు కాలేదు. శాసనాలన్నీ అనువదింపబడి అచ్చయితే కాని కోర్టులలో తీర్పులు తెలుగులోకి రావడానికి అవకాశం ఉండదు.

రెండవది తెలుగులో కార్యకలాపాలు నడిపించడానికి తెలుగు టైపుమిషన్లు ఎక్కువ లేవని అంటున్నారు. దాదాపు 2000 మిషన్లు కొనడం జరిగినా వాటిని అవసరమైన ఆయా కార్యాలయాలకు అందజేయడంలో జాప్యం జరుగుతున్నదని వింటున్నాం. తెలుగు టైపు చేసే వారికి సంతృప్తికరమైన శిక్షణ కూడ ఇవ్వవలసి ఉన్నది.

మూడవది పరిపాలనకు అవసరమైన పారిభాషిక శబ్దావళి సమస్య. వెనుక శ్రీ అయ్యదేవర కాళేశ్వరరావుగారి అధ్యక్షతన రూపొందింపబడిన నిఘంటువు ఆధారంగా అధునాతనమైన నిఘంటువును తయారుచేయాలి. పారిభాషిక శబ్దాల నిర్మాణం జరిగి అవి అన్ని ప్రభుత్వ శాఖలకు సరఫరా అయితేగాని నిత్యపాలనలో తెలుగును ధారాళంగా అధికారులు ఉపయోగించలేరు.

నాల్గవది రాష్ట్ర శాసనసభలోను, విధాన పరిషత్తులోను బిల్లులు ఇంగ్లీషులో ప్రవేశపెట్టబడి అవే అధికారికమైనవిగా అంగీకరింపబడుతున్నాయి. అనువాదాలకు గుర్తింపు లేకుండా ఉన్నది. మూల శాసనాలను తెలుగులోనే తయారుచేసే స్థాయికి రావలసి ఉన్నది.

ఇలా ఏ విధంగా చూచినా ప్రజల భాషలో ప్రభుత్వ కార్యకలాపాల నిర్వహణ ఏమీ ప్రోత్సాహకరంగా లేదన్నది సారాంశం. ఇవీ ఇంకా ఇలాంటి ఇతర అవరోధాలను అధిగమించి రాష్ట్ర నూతన ప్రభుత్వం భాషధారక రాష్ట్ర నిర్మాణంలోని ప్రధాన లక్ష్యాన్ని సాధించాలని మా ఆకాంక్ష.

ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ విద్యావిధానంలో ఇంతవరకు త్రిభాషా సూత్రం అమలులో ఉన్నది. ఈ విషయంలో ఇంకా నూతన ప్రభుత్వ విధానం స్పష్టం కాలేదు. ప్రస్తుతం త్రిభాషా సూత్రం అమలుపరుస్తున్న తీరులో కొన్ని లోపాలు ఏర్పడి ఉన్నాయి. వీటిని సరిచేసి తెలుగు-హిందీ-ఇంగ్లీషు భాషల అధ్యయనాన్ని పటిష్ఠం చేయవలసి ఉన్నది. ఇతర భాషల యెడ వ్యతిరేకులం కామని గౌ॥ ముఖ్యమంత్రిగారు ప్రకటించియున్నారు. ఇక ముందు కూడ ప్రభుత్వం మూడు భాషల విధానాన్ని దృఢ వైఖరితో కొనసాగిస్తుందని విశ్వసిస్తున్నాము.



# పుడమి గుండెలు

—సోమసుందర్

లోకమందలి బరువులన్నీ
మోసి సాగే బడుగు బానిస-
లోకమందలి సోకులన్నీ
మొరటు చేతుల తీర్చు మానిసి-

వెన్నుపూసలు జారగా- నిలు
వెత్తు దేహము క్రుంగగా-
అడ్డమై గార్ధభము రీతిగ
సాగిపోయే బడుగు బానిస ....

లోకవృత్తము పరుల కష్టము
పైనసాగే బండి చక్రము ....
పేదలను శ్రమ జీవనులుగా
మార్చి దోచే విషమ వక్రము....

పరుల పీడనపైన బ్రతికే
ఈ వ్యవస్థకు చెల్లె కాలము
కష్టజీవుల కరములన్నీ
కక్షతో ఏకమై పెనగును ....

ఒక్క క్షణ మాలోకనముతో
సత్యమారసి విజృంభిస్తే
పీడితుల సంకల్పదీక్షకు
పీడకుల శని విరిగిపడునిక!

మూపుపైగల బరువులన్నీ
దుళ్ళగిస్తూ కూల్చివేస్తే —
పుడమి చల్లని ఫలద్రుమమై
అందరికి ఆదరువు లిచ్చును ....

కష్టజీవుల మనసులందున
జ్ఞానజ్యోతులు ప్రకాశిస్తే
లోకమే స్తంభించిపోదా
నాక మిలపై వెలయ రాదా!

పరుల దోచిన సిరులకింకా
సుఖ విలాసము లెంతకాలము?
సోమరుల నర రక్త దాహము
సాగిపోయేదెంత కాలము?

బడుగు మనుషుల రక్తమాంసము
ధనపిశాచికి నివేదనమై
మానవత్వపు సుందరాశ్యము
మలీమసమగుటెంతకాలము?

రక్కసులు అధికార్లు మట్టగ
బ్రతుకు టెముకలు వికలమవగా
దుష్టపాలకవర్గ మేదో
జాలి చూపుట ఎంత కాలము?

తరుణజీవన సుహాసములకు
రక్తచందన మలమటెందుకు?
ధనమదాంధుల వికట జీవన
ధ్వాంత మేఘము లెంతకాలము?

బ్రతుకు నీరన స్మశానముగా
దుఃఖ ధూమము లెగయుటెందుకు?
కొండ లెక్కిన ఆశలన్నీ
కొసరి కొసరీ పిలుచుటెందుకు?

పుడమి గుండెలు చీల్చుకొని, న
వ్యాతిథిగ జగదేక మానవు
డాగమించే మంచి దిన మా
ర్తాండ కాంతు లికెన్నడో!

కళాకేళినికేతన్
పిఠాపురం, 533 450.

# అనుభూతిరథం - ఆలోచనాశ్వాలు

-చాగంరెడ్డి నరసింహారెడ్డి

అదొక దుర్గం... అదొక భూతల స్వర్గం
అది చేరుట అనితర సాధ్యం.
అక్కడ ఇక్కడలాగే
గిరులున్నాయి... పారే ఝరులున్నాయి
తరులున్నాయి... అరవిరిసిన విరులున్నాయి
కానీ అక్కడి గిరులు మాట్లాడతాయి
అక్కడి ఝరులు సంగీతం వినిపిస్తాయి
అక్కడి తరులు నిర్మిస్తాయి విశాల వనవాటికలు
అక్కడి విరులు వాటిలో అరవిరిసిన బాలికలు- మృదుమధుర సుధామాలికలు
అక్కడి తరుచ్ఛాయలు
ఇంద్రదేవుని కల్పద్రుమశాఖాఛాయలను మించినవి
శీతలత్వము- కోమలత్వము- రాగతత్వము మిళితమైయున్నవి.
అక్కడి లతాంతములు
శచీదేవి ధమ్మిల్లమున ముడిచిన
పారిజాత సుమాలను మించినవి- వసివాడవు కసుగందవు
పైగా ప్రేమతత్వమును జీర్ణించు కొన్నవి.
అక్కడి గిరులు
వజ్రి వజ్రాయుధ భీకర నిష్ఠుర ఘాతాలకు లొంగనివి.
అక్కడి ఝరులు
గాంగఝరి కంటె పవిత్రములు
అనవరత పయః పూరితములు
అక్కడ ఇక్కడలాగే రహదారులున్నాయి
అక్కడి రహదారుల్లో నిత్యమూ
జల్లులు జల్లులుగా కురిపిస్తాయి తరులు
తమ ఆనందాశ్రువులనే విరులను,

అక్కడా మేడలున్నాయి- మేడలన్నీ వాడలున్నాయి.
అక్కడి మేడల్లో నిత్యహసితవదనాలు
అక్కడి వాడల్లో నిత్యజ్వలిత చైతన్య సదనాలు.
అక్కడ ప్రతియింటికి ఒక చంద్రుడుదయిస్తాడు.
ప్రతియింటిని ఒక సూర్యుడు కరుణిస్తాడు.
అదే నావూరు- అక్కడ వున్నది నాకొక సదనం
అది పరిపూర్ణానందనిలయం- మధురసరాగ వలయం.
ఆ ప్రక్కనే ఒక వనం- అదే ఉద్యానవనం.
దాని ప్రక్కనే ఒక ఝరి- అదే సంతోషపుదరి.
వినిపిస్తుంది నాకెప్పుడూ ఆ ఝరి
మంజుల సంగీతం- అదొక సంగీత రసవాహిని.
అక్కడ నిలుచుంటే నాహృదయం భావవీచికలను ప్రసరిస్తుంది.
నాఅంతరంగం మధుర సుఖావాహినియై పొంగుతుంది.
అక్కడ ఒకసారి- ఒకదరి కనిపించినదొక దృశ్యం
కనులు ఖిన్నమయ్యె- తనువు తన్మయ మయ్యె- మనసు చిన్మయ మయ్యె
ఒక ఇందీవరనయన- నిత్యహసితవదన
నిలుచున్నది- ఓరగా నన్నే చూస్తున్నది.
ప్రకృతి ప్రత్యణువులోని అందాలన్ని రాశీభూతమైనట్లు తోచె.
ఆమె కనుల చూపుల తూపులు నాయెదను నాటె
ఆమె పగడపు పెదవుల అరుణ కిరణాలు నాయెదను కాల్చె
ఆమె విశ్వాసపవనోర్మికలు నాఅంతరంగమున వీచె
ఆమె చరణారుణ కిసలయాంగుళములు హృదయ సదనముపై నర్తించినట్లుతోచె.
నాయెదలో మంజులభావములు రేపు మలయ పవనము వీచె
అప్పుడు విశాలగగనము నుండి నిశాపతి వెన్నెల కుప్పలు పోసె
ఒక్కసారిగ తరులు తలలూపె- విరులు మధురముగ హసించె
గిరులు మృదంగము మ్రోగించె- ఝరులు పులకించి వినిపించె
సుగీత నినాదము- మధురగీత కలనాదము.
కరిగెడెందము అమృత ధారగా- వెలిగెవదనము మణి కిరణముగా.
చిత్తమున లతలు గుప్పించె కుసుమపరాగము

ప్రకృతియంతయు రేపె అభినవ సరాగము
ఒక్క అడుగుముందుకు వేయలేదు- పది అడుగులు దాటె చిత్తము
ఒక్కమాట పెదవి దాటలేదు- మనమున సంతత మయ్యె కవితా విత్తము.
అంతలోనె అదృశ్యమయ్యె ఆరమణి
ఇదేమి చోద్యమో నాకర్థము కాలేదాసరణి.
అయినా ఆమె కొరకు రోదించను- మనసును బాధించను.
అవిభాతి వనితా ముఖం
ఇచ్చినది నాకొక దివ్యానుభూతి.
అది నిలుచును నాలో సదా
అది నాకిచ్చెగదా ఈ కవితాసుధ.

తెలుగు లెక్చరర్,
జి. హెచ్. ఆర్. ఎమ్. సి. అర్.
గుంటూరు-522 004.

# రెండు కవితలు

—కె రి నాగరాజు

పేగులు సుళ్ళుతిరుగుతున్న
విస్తరిలో వడ్డించినది
రెండు మెతుకులే రుచి చూసి
వదిలేస్తాం! చిందులు తొక్కే
గొడ్డును బలంగా ఈడ్చుకువచ్చి
గుంజకు కట్టేసినట్టు రాని
గొప్ప హుందాతనాన్ని
ప్రదర్శిస్తూ వుంటాము
కేవలం పలుకుబడితోటే
హీరోపాత్ర కొట్టేసి
ఫోజులుకొట్టే వాడిలాగా
లేనిపోని నాజూకుతనంతో
వొళ్ళంతా వొంకర్ల గారడి
చేస్తూంటాము.

2

సొంత గొంతుకతో మాట్లాడుకోని
వాళ్ళము కొత్తఆలోచనలు దరికి
రానివ్వని వాళ్ళము గుండెవదులుకొని
జీవించే వాళ్ళము ముసుగు ఆటనే
ప్రేమించే వాళ్ళము మాకెందుకు
తిరుగుబాటు? మాకెందుకు
దేశం ప్రగతిపాటు ?

# యుగ సంగీతం

—ఏ. సూర్యప్రకాశ్

కవి నిద్రమాత్రలమ్ముకుని బ్రతికే విక్రేత కాదు కలలబేహారి కాదు
కవి చెవుల్లో నిరంతరం కవిత్వమే గింగురుమని నినదిస్తుంది
కవి కళ్ళు వింటాయి చెవులు చూస్తుంటాయి
గుండె కిటికీలు చిరుగాలి అలల తాకిడికే కదలి కొట్టుకుంటాయి
జీవిత సంద్రంలో వలవేసి కవితల చేపలు పడుతుంటాడు
కవిత్వం రోజుకు ఇరవైనాలుగు గంటలూ జీవింపజేస్తుంది
కవిత్వం వ్రాసేశాక సుఖప్రసవమైనట్లుంటుంది.
నిర్భాగ్యుల కన్నీటికి వేడీ వేగం హెచ్చినప్పుడు విద్యుచ్ఛక్తి పుడుతుంది
జరుగుతున్న చరిత్రకు బాష్పం భాష్యం చెబుతుంది
భావమూ భాషా సరిసమానంగా ప్రక్క-ప్రక్కన నడుస్తూ
కవాతు చేసే సైనికుల్లా ముందడుగు వేస్తాయి
ప్రేరణ సిమెంటై ఇసుమై రూపు దిద్దుకొని
కవితాభవంతి కవి ఎదుట నిలబడుతుంది
కళ్ళు మూసుకొని నిద్రలో నడుస్తున్న పాఠకుడికి
కవితాగుమ్మం తగిలి తల బొప్పి కడుతుంది!
నిన్నటిలా కాల్పనిక ఊహాజనిత ఉటోపియా కాదిది
నివసించడానికి సరికొత్త సమాజాన్ని ముందు నిలబెడుతుంది.
కవితలు పావురాలై ఎగిరి ఇల్లిల్లూ వాడవాడా
ఊరూరా దేశదేశాలూ తిరిగి
నలుదెసలకూ చైతన్య సందేశ లహరుల నందిస్తాయి
అమాయకపు గీతాలు కావివి అనుభవసారంలోంచి మొలిచిన మోదుగులు
గుండెల కొండల వెనుక తలలెత్తిన సూర్యోదయాలు
హృదయపు ఊటలలోంచి స్వచ్ఛందంగా పెల్లుబికి వచ్చిన మహోద్రేకాలు!
కవిత్వం జనాన్ని జవనాశ్వాల్లా ముందుకు పరుగెత్తిస్తుంది
కవిత్వం ప్రశ్నిస్తుంది నిలదీస్తుంది
కదుపుతుంది కుదుపుతుంది
వెంటాడుతుంది వేటాడుతుంది
ఆత్మ ఆత్మతో మాట్లాడుతుంది
యుగ సంగీతం నేపథ్యంలో వినబడుతుంది!

1-7-87, పంత్‌రోడ్,
ఆర్మూర్ - 503 224.

# ముతక జీవితం

-శ్రీ కాట్రగడ్డ

ఓపీ ముట్టించినా స్పెన్సర్ చుట్ట దట్టించినా... ధూమం- ధూమపానమే!
నాటుకొట్టినా సీటుగా వాట్ పట్టినా... మధువు- మధుపానమే!
గడ్డిమేటులో దొర్లినా ఫైవ్‌స్టార్ హోటల్లో మరిగినా... కామం- శృంగారరూపమే!
స్వంతింటికి కన్నం వేసినా మింటికెగ్బ్రాకి దొంగతనం చేసినా... చోరత్వం- చోరగుణమే!
ఆడదాని మెళ్ళోతాళికి మగవాడి చేతి పేపీలకి తేడా తెలియడంలా;
గుళ్ళో పూజారి మంత్రాలకి శాసనసభల్లోని కార్యకలాపాలగోలకి అదే సాపత్యం!
ఊళ్ళో నూర్చే కుప్ప నూర్పిళ్ళకి బ్యాంకుల్లో మనీతార్పుళ్ళకి భేదం తెలియడంలా!
బళ్ళో పిల్లలకి నూరిపోసే నీతులకి బయట పల్లకీలు మోసే నేతలు కూసే కూతలకీ
సంబంధమేం సరిపడటంలా!
అయినా రోజులు గడుస్తున్నాయి గడియారాలు తిరిగేస్తున్నాయి- ఆటోమేటిగ్గా!
పోయిన్రోజులు మంచివనుకుంటూ మురుస్తూ భావిని గూర్చి తలపోస్తూ నేడునుమరచి దశదిశలా
ప్రభవిస్తున్నాం;
మనోంతరంగంలోని మలిన దృశ్యాల్ని చూళ్ళేని మనం నిస్తంత్రీ దృశ్యాల్ని నిశ్చింతతో
చూసేస్తున్నాం;
రోజూ సూర్యుణ్ణి చూస్తున్నాం చుక్కల్ని లెక్కెట్టగలుగుతున్నామా?
వేడిగాడ్పుల్ని అనుభవిస్తున్నాం చంద్రకళల చల్లదనాన్ని చేదుకుంటున్నాం!
వాడి చూపుల కలుకు మాటల వెలుపు క్రీడల ఈ ముతక జీవితాలు
కాటన్ మార్కెట్టులోని బ్రాకెట్ సంఖ్యలా ఇంకిపోతున్నాయి!
ఈతిబాధలు క్లబ్బుల్లోని పేకముక్కల గుట్టల్లా కనబడుతున్నాయి'
మూతిమీద మీసాలు మొలుస్తున్నాయిగాని మతిశ్రుతి సరిగ్గా నిలవడంలేదు!
కోతిగుణాలింకా మానవత్వం నుండి విడివడడం లేదు!!
మందారప్పువ్వు రంగు స్ఫటికంలో పరావర్తనం చెందినా స్ఫటికం స్ఫటికమే!
ఇటుక పుటకేమిటి మన్నూకల్క కొన్ని రోజుల అగ్నిగుండంలోని ఆజ్యస్వరూపం!!
పుటకేమైనా మట్టిలో కలిసిపోవడం మానవనైజమైపోయింది
కిటుకు తెలియని పటుత్వం లేని మనసుల్లో శూన్యం క్షాళనం కాకుండా ఉంది!
ప్రక్షాళనమయ్యేదెప్పుడు? బ్రతుకులు ప్రస్ఫుటమయ్యేదెప్పుడు??

కాట్రగడ్డ లక్ష్మీనర్సింహారావు,
పెదపాడు - 534 437.

# సుందర కళాజగత్తులో ఆభాసా లక్షణం

-కొండిపర్తి శేషగిరిరావు

రసజగత్తులో కొన్ని ప్రత్యక్షాలు మరికొన్ని ఆభాసలూ ఉంటాయి.

రసజగత్తులో, రసము ప్రత్యక్షమూ ఆభాసమూ కూడా. రసావిర్భావానికి మూలము కొన్ని భావాల సమీకరణ. ఆ రసముల రూఢికి ఆ రసాలకు చెందిన స్థాయీ భావనలు. నిజానికి రసమూ, భావమూ అన్నవి పరస్పర ఆశ్రితాలూ, పోష్యపోషకాలూ, ఆధార ఆధేయాలు. కళా జగత్తులో కొన్ని భావాల సమీకరణ యే రసము. ఆ భావాల పుట్టుకకుకారణం వాస్తవ జగత్తులోని రససంఘటనా, అందులోని ద్రవీభూతత.

కళాజగత్తులోని రసమూ, అందులోని భావాలూ అన్న వాటిని గురించి పరిశీలన జరుపవలసి వచ్చినప్పుడు కళా సృష్టికి ముందున్న వాస్తవరసమూ అందులోని భావాలూ అన్న అంశాల గురించి ఆలోచించవలసి ఉంటుంది.

రస సృష్టికి ముందున్న రసమూ భావమూ అన్నవి వాస్తవికాలూ ప్రాకృతికాలూ అవి రస జగత్తులోని 'అందము' అన్న మూలకంతో మిశితమైవచ్చినప్పుడు అవి కళాజగత్తులోని రసములుగానూ భావాలుగానూ చెలామణి అవుతున్నాయి. కనుక రస జగత్తులోని రసాలకూ భావాలకూ మూలం వాస్తవ జగత్తులోని రసమూ భావమూ. ఐతే ఈ రెంటికీ విభేధం ఒక్క 'అందం' అన్నచోటే ఉన్నది. ఈ 'అందం' అన్నది వాస్తవ జగత్తులోని రసమూ భావమూ అన్నవాటితో అప్పుడప్పుడూ కలుస్తూ ఉంది. అలాకాక ఆ అందం రస భావాలతో పూర్తిగా కలుస్తూ ఉంది కళా సృష్టిలో. అందుకని వాస్తవ జగత్తుకు కాస్త విభిన్నమైన మరో జగత్తుగా పుట్టింది రస జగత్తు.

కళ, సృష్టింపబడుతూ ఉన్నపుడు; రసజగత్తులోని రసాలూ భావాలూ ప్రత్యక్షాలుగా, ఉంటాయి. ఆ సమయంలో వాస్తవ జగత్తులోని ముడిరసాలూ భావాలూ; రస జగత్తులోని భావాలకూ రసాలకూ ఆభాసలుగా కనిపిస్తాయి. అందుకనే ఆ కళాసృష్టికి ముందూ వెనుకా ఉన్న మనిషికి ఆ సృష్టిలోని రసాలూ భావాలూ, వాస్తవ జగత్తులోని రసాలకూ భావాలకూ అందమైన ఆభాసలుగా అనిపిస్తాయి.

కనుక రస జగత్తుకు ముందూ వెనుకా ఆభాస అన్న ఒకానొక అంశ అన్నది ఉన్నది.

2

కొంచెం లోతుగా ఆలోచిస్తే ఈ ఆభాస అన్న అంశ రస జగత్తుకు ముందూ వెనుకా మాత్రమేకాదు ఉన్నది, రస జగత్తులోనే ఈ ఆభాస అన్న అంశ ఉన్నది. అది రససృష్టి జరుగుతున్నప్పుడు ఉన్న కళా సృష్టిలోనే నిక్షిప్తమై నిగూఢమై ఉన్నది. పైగా అది కళాసృష్టిలోని సాంకేతిక అంశాల వెనుక దాక్కొని మర్మంగా ఉన్నది.

కాలాలు ఎన్నిమారినా, దేశాలు ఎన్నిమారినా వర్ణనలూ, అలంకారాలూ, ఉపమానాలూ అన్న అంశాలు గానీ వాటి వాసనలు గానీ లేని సాహిత్యం అన్నది ఉండదు. కాకపోతే గతానికీ ఇప్పటికీ ఇక ముందూ వాటి రూపాలలో భేదం ఉంటే ఉండవచ్చు, వస్తే రావచ్చు. కాని వాటి గుణాలు మాత్రం సాహిత్యం అని చెప్పబడే దానిలో లేకుండా పోవు

కనుక మనము ఒక సాహితీ ఖండికను గానీ లేక ఒక సాహిత్య గ్రంథాన్ని గానీ చదువుతున్నపుడు అందులో ఎన్నో వర్ణనలూ, అలంకారాలూ ఉపమానాలూ ఉంటాయి. అవన్నీ మనలో ఎన్నో భావాలను రేపి ఎన్నో సంఘటనలను మనముందు సృష్టించి, ఆ సంఘటనలలోకి మనలను ద్రష్టలుగా లాక్కెళ్తాయి. యదార్థానికి అవన్నీ ఆ సాహిత్యాన్ని చదువుతున్నప్పుడు మన చుట్టూ ఉన్నవా అంటే, లేవు. అవన్నీ సాహితీ జగత్తు మన చుట్టూ అల్లిన ఒక అల్లకం. అంతమాత్రంతో సాహిత్యం అన్నది తనను పఠించే పాఠకుని చుట్టూరానూ అతని లోపలా కల్పనను సృష్టించే ఓ శుద్ధ కాల్పనిక మూలం అని అనుకోనక్కరలేదు సాహిత్యం పాఠకుని చుట్టూ అల్లిన సంఘటనలు అన్నీ వాస్తవ జగత్తులోని సంఘటనల నుండి తీసుకున్నవే. కాకపోతే వాని మేళవింపులోనూ, వానిని పాఠకునికి పదరూపంలో అందించే తీరులోనూ కల్పన అన్నది ఉన్నది. కనుక సాహిత్య సృష్టికి తీసుకున్న సంఘటనలూ అందులోని రసాలూ భావాలూ వాస్తవ జగత్తులోనివే. అందుకని సాహిత్యంలోని రసాలూ భావాలూ వాస్తవ జగత్తులోని రసాలకూ భావాలకూ అందమైన ఆభాసలు.

అందుకని సాహిత్యంలో సృష్టింపబడే రసాలూ భావాలూ, సంఘటనలూ వాటి కదలికలూ వాస్తవ జగత్తులోని రసాలకూ భావాలకూ సంఘటనలకూ వాటి కదలికలకూ మధురమైన ఆభాసలు.

ఈ ఆభాస అన్నది సాహిత్యానికి జీవమైన అలంకారాలూ వర్ణనలూ ఉపమానాలూ అన్న అంశాలలో పుట్టూ ఉన్నది. వాటి ద్వారా సాహిత్యం వాస్తవానికి అందమైన ఆభాస రూపంగా ఔతున్నది.

యథార్థానికి, వాస్తవం అన్నదాని మీదే ఆభాస అన్నది వస్తున్నది. కనుక ఆభాసలో వాస్తవం ఉంది. వాస్తవం కూడా ఆభాసాతత్వాన్ని కలిగి ఉన్నది. కనుక ఈ రెంటి మీదా ఆధారపడిన సాహిత్యమూ అందులోని రసాలూ భావాలూ ఆభాసా గుణాలను కలిగి ఉన్నాయి.

అంతే కాకుండా సాహిత్యం మనలో సృష్టించిన పాత్రల రూపాలూ, వాటి చుట్టూ ఉన్న వివిధ రూపాలూ, ఇవన్నీ ఉన్న దృశ్యమాన దృశ్యాలూ అన్నీ వాస్తవ జగత్తులో రూపాలకు ఆభాసారూపాలే. ఆభాసా దృశ్యాలే.

* * *

శిల్ప చిత్రకళ ఒ రూపాలు గలవి.

ఆ శిల్పచిత్రకళలలో, సమూహ మూర్తులుగల ఒక శిల్పకృతిలో గానీ, లేక సమూహ రూపాలుగల ఒక చిత్రపటము గానీ మనము చూస్తూ ఉన్నప్పుడు ఆ శిల్పంలో ఆ చిత్రంలో ఉన్న ఆకృతులు మనకు; తమ తీరుతెన్నులతో ఎన్నో భావాలను వ్యక్తంచేస్తూంటాయి. ఆ రూపజన్య భావాలను పట్టుకొని మనము చూస్తున్న ఆ శిల్పంలోని మూర్తుల ద్వారా గానీ లేక ఆ చిత్రంలోని రూపాలద్వారా గానీ ఎన్నో మాటలు మనకు అందుతాయి. ఈ బొమ్మ ఈ బొమ్మతో ఇలా అంటున్నది. ఆ బొమ్మ ఈ బొమ్మతో ఇలా అంటున్నది అని అంటాం. ఇలా అంటున్న మన మాట ద్వారా, శిల్ప చిత్ర కళలలోని రూపాలు పలికే నిశ్శబ్దమైన పలుకులు మనకూ మన మనస్సుకూ వినిపిస్తున్నాయి అని రూఢి ఔతున్నది. యదార్థానికి ప్రత్యక్షంగా నిశ్శబ్దమైన రూపాలు నిశ్శబ్దంగానే ఉన్నాయి. పాపం అవి మనతో ఏ మాటా మాట్లాడనే లేదు. కానీ వాటిని చూస్తున్న మనం అవి పలికే పలుకులను అవి చెప్పే నిశ్శబ్ద భావాల ద్వారా విన్నాం.

ఇలా శిల్పకళలోనూ చిత్రకళలోనూ సమూహ రూపాలు మౌనంగా మనలో పలికే పలుకులు అన్నీ వాస్తవజగత్తులోని భావాలు పలికే ఆభాసపు పలుకులే.

సాహిత్యంలో ఎలా పాత్రల రూపాలూ దృశ్య రూపాలూ వాస్తవ జగత్తులోని పాత్రలకూ దృశ్యాలకూ ఆభాసలో, అలానే శిల్పచిత్రకళలలోని రూపాలు

చెప్పేస్తుంటే మాటలూ అన్నట్టుండే పలుకులూ వాస్తవ జగత్తులోని మాటలకు ఆభాసా శబ్దాలే.

మన కంటికి అర్థమయ్యేటట్టున్న ఆకృతులు, రూపాలు గల శిల్ప చిత్ర కళలలో రూపబలం దృశ్యబలం అధికం. అలా కాక మన కంటిని ఎటు త్రిప్పి చూచినా మన బుద్ధిని ఎటు వంచి చూసినా ఏ మాత్రం అర్థం కాకుండా ఉండే అపరిచయ సంకీర్ణ రూపాలను కలిగిన ఆధునిక శిల్ప చిత్ర ఖండికలు వాస్తవ జగత్తులోని భావనా రంగంలోని భావాలకు అందమైన అరూప, విరూపాలూ; వాటికి అందమైన ఆభాసలూ, కనుక నవీన శిల్పచిత్రకళలలోని రూపంలేని రూపాలు వాస్తవ జగత్తులోని భావాలకు అందమైన ఆభాసా రూపాలే.

కనుక సాహితీ జగత్తులోని రూపజగత్తు, ఎలా వాస్తవ జగత్తులోని రూప జగత్తుకు ఆభాసరూపమో; అలానే శిల్ప చిత్ర జగత్తులలోని పలుకుబడి వాస్తవ జగత్తులోని శబ్ద జగత్తుకు ఆభాసా శబ్దమే.

ఈనాడు మన కన్ను చూస్తూ ఉండే ప్రతి వార మాస పత్రికలలోని బొమ్మలు మన చెవులో ఎన్నో మాటలను పోస్తుంటాయి. అవన్నీ మన అధోచేతనకు అందుతూనే ఉంటాయి. కానీ మనం ఆ బొమ్మలను పట్టించుకోం. అవి చెప్పే మాటలను వినం. అలా కాక. వాటిని పట్టించుకొని చూడటం ప్రారంభిస్తే, ఆ బొమ్మలు మాట్లాడే మాటలన్నీ మన జాగ్రదవస్థలోని చేతనకే అందుతాయి.

కనుక శిల్ప చిత్రకళలలోనూ సాహిత్యంలోలా ఆభాసాగుణం అన్నది ఉన్నది.

ఇకపోతే నృత్యకళలో ఉన్నదంతా ఆభాసారూపమే

నృత్యము తన హస్తముద్రల ద్వారా, హస్తస్థానాల ద్వారా వాస్తవ జగత్తులోని వస్తుజాలములోని ఎన్నో వస్తువులను భావానుగుణంగా రసానుగుణంగా సందర్భాన్ననుసరించి ప్రదర్శిస్తుంది.

నాటకంలో గానీ నాటికలో గానీ అయితే నటులు యథాతథంగా వాస్తవ వస్తువులనే రంగస్థలం మీద ఉపయోగించి తను నటించే పాత్రలోని భావానికీ రసానికీ ఉదాత్తతను కలిగిస్తారు.

కాని నృత్యకళలో అలాకాదు. నృత్యములో నర్తకులు ఎలాంటి వస్తువులనూ భావవ్యక్తీకరణకు ఉపయోగించరు. వస్తువు లేకుండగనే కేవలం తమ హస్తముద్రలతో ఆ వస్తువులను చూపిస్తారు. వస్తువులు ఉపయోగించునప్పుడు ఎలాంటి హస్తముద్రలు పడతాయో అలాంటి హస్తముద్రలను అందంగా ఆయా స్థానాలలో ప్రయోగించి, ఆయా వస్తువుల(ఆభాసా) రూపాలను ఆ నృత్యంలోకి రప్పించి ఆ వస్తువులను ఉపయోగించినట్లు నృత్యం చేస్తూ ఆ నృత్యంలోని భావాన్నీ రసాన్నీ ఉపనిష్ఠము చేస్తారు.

నిజానికి నాటకంలోలా ఆయా వస్తువులు వాస్తవంగా అక్కడ లేవు, కానీ ఆయా వస్తువులు అక్కడ ఉన్నట్లూ, ఆ వస్తువులను నర్తకులు అందంగా పట్టుకొని నృత్యం చేస్తున్నట్లు ప్రేక్షకులు భావిస్తారు. ఉన్నాయంటారుకూడా. కనుక నృత్యకళా జగత్తులో హస్తముద్రల ద్వారా ధారావాహికంగా వచ్చే వస్తువుల రూపజాలమంతా వాస్తవ జగత్తులోని వస్తువులకు ఆభాసారూపాలే.

అంతే కాదు, నృత్యకళలోని పాత్రలూ పాత్రల రూపాలకు ఆభాసారూపాలుగానే ఉంటాయి.

నర్తకి ఒకే ఒక ఆహార్యాన్ని ధరిస్తుంది. కానీ ఆ నర్తకి రంగస్థలం మీద ఎన్నో భావాలను ఆ ఆహార్యంతోనే ఆవిష్కరించి ఆ పాత్రలో నర్తిస్తూ ఎన్నో భావాలను మౌళిక రసానికి అనుషంగికంగా అందిస్తుంది.

కనుక ఒక నర్తకి ఒకోపాత్రను తన హస్తముద్రలతోనూ భంగిమలలోనూ ఆవిష్కరించి ఆపాత్ర పని పూర్తవగానే దానిని చెరిపివేసి మరోపాత్రను ఆవిష్కరిస్తుంది,

ఇలా ఒక పాత్రను ఆవిష్కరించి మరోపాత్రను ఆవిష్కరించటానికి, ఆ గతపాత్రను చెరిపేస్తూ మరో పాత్రను సృష్టిస్తూ నృత్యంలో సాగిపోతుంది నర్తకి.

అందుకని నృత్యకళలో వస్తువుల యొక్క రూపాలూ పాత్రల యొక్క రూపాలూ ఆభాసలు గానే ఉంటాయి

వాస్తవ జగత్తులోని వస్తురూపాలకు నర్తకి హస్తాలూ హస్తముద్రలూ తయారు చేసే రూపాలు అన్నీ వాస్తవ జగత్తులోని వస్తురూపాలకు అందమైన ఆభాసారూపాలే

అలానే నర్తకి తన భంగిమలో పట్టే ప్రతి పాత్రా వాస్తవ జగత్తులోని పాత్రలకు అందమైన ఆభాసు రూప పాత్రలే.

కనుక నర్తకి నర్తనంలో ఉన్నదాంతో కాకపోయినా చాలావరకు వాస్తవ జగత్తుకు గల ఆభాసారూప జగత్తే.

* * *

సంగీత కళలోకి వస్తే సంగీత కళలోని సప్త స్వరాలు జంతు, పక్షి స్వరాలకు ఆభాసాస్వరాలే. ఇచ్చట ప్రాకృతికమైన స్వరం సంగీతంలో శ్రుతి యుక్తమై చేరి సంగీతంలో ఇంపుతనాన్ని చేకూరుస్తున్నది. వాస్తవ జగత్తులోని వాస్తవస్వరం సంగీతం ద్వారా శృతియుక్తమవటం వల్ల దానికి కమ్మదనం హెచ్చింది. ప్రకృతి స్వరానికి సంగీత స్వరం శృతి కలిగిన స్వరం కాన సంగీత స్వరం ప్రకృతిలోని స్వరానికి ఆభాసా స్వరం అయినది.

సాహిత్యంలో వలెనే, సంగీతకళలో గల అనేక స్వర బాణీలూ, అందులోని స్వర రచనలూ శ్రోతలలో అనేక భావాలనూ రసాలనూ కలిగిస్తుంటాయి. అవన్నీ వాస్తవ జగత్తులోని భావాలకూ రసాలకూ ఇంపైన అభాసాభావాలూ రసాలూ.

సంగీత సాహిత్యాలు అన్నప్పుడు సంగీత కళలో భావమూ రసమూ అన్న వాటికి సాహిత్యమే ఆధారమనీ సంగీతము ఆధేయమని అనుకుంటాము. నిజానికి సాహిత్యములోని పదాలూ అందులోని శబ్దాలూ సంగీతానికి నామమాత్రాలే. స్వరరచన మాత్రమే ప్రాధాన్యత వహిస్తుంది. ఈ స్వర రచనలలోని వివిధ బాణీల వలనా, సంగీతమట్టుల వలననే సంగీత కళలో భావాన్నీ రసాన్నీ పొందగలము. సంగీతంలో సాహిత్యమన్నది, అందులోని ప్రతి అక్షరమూ స్వరంలో కలిసి కరిగిపోతుంది అప్పుడు మనకు వినిపించేది స్వరం మాత్రమే. కాకపోతే దాని వెనక ఎక్కడో అక్షరం ఉంటుంది. సంగీత కళలోని రసజ్ఞత, మనకు స్వరం ద్వారా భావాన్నీ రసాన్నీ పొందామని చెబుతుంది గానీ అక్షరం ద్వారా కాదు.

సంగీతంలో పలికే సాహిత్య అక్షరం క్రింద ఉన్న స్వరాన్ని మాత్రమే. అలా పలుకుతున్నప్పుడు ఆ అక్షరం శబ్దంలో దాని క్రింద నున్న స్వరాన్ని గానీ లేక స్వరాలను గానీ నింపి పలుకుతాము. అప్పుడు అక్షర శబ్దమూ, దాని గుణమూ చాలవరకు అదృశ్యమై అవ్యక్తంగానే మిగిలిపోతుంది. కనుక సంగీత కళలో స్వర రచనకు క్రింద నున్న సాహిత్య అక్షరాలు స్వర రచనలోని స్వరాలకు అభాసా అక్షరాలే. సంగీత స్వరం అన్నదే ప్రకృతిలోని ఒకానొక జీవి స్వరానికి ఇంపైన ఆభాసాస్వరం. అలాంటి స్వరంలో పలికే అక్షరం ఆ అక్షరంలో అక్షరగుణంతో పలికే శబ్దం సంగీత స్వరానికి ఎంతో ఆభాసగుణం గలది.

వాద్య సంగీతంలో పరిచయమైన పాటను వింటున్నప్పుడు మనము ఆ పాటలోని అక్షరాలను వింటున్నట్లు భావిస్తాము, యదార్థానికి ఆ వాయిద్యంలో పలికేవి ఆ అక్షరాలు కాదు. ఆ అక్షరాల క్రిందనున్న స్వరాలు. ఆ స్వరాల మీద వ్రేళ్ళు పడతాయి సంగీతకారుడికి. మనకు సాహిత్యాన్ని విన్నట్లు భ్రాంతి కలుగుతుంది. అలా భ్రాంతి కలగటానికి కారణం ఆ సాహిత్యానికి కూర్చబడిన స్వరబాణీయే

అన్ని కళలలో ఉన్నట్లుగనే సంగీత కళలోనూ అందులోని సాంకేతిక అంశాల క్రింద అభాసాగుణం అన్నది ఒకటి ఉన్నది.

3

ఇలా లలిత కళా జగత్తులోని ప్రతి లలిత కళలోనూ అభాసాలక్షణం అన్నది ఎక్కడో ఒకచోట దాక్కొని ఉంది. ఈ అభాసాలక్షణం అన్నదే వాస్తవ జగత్తులోని భావాలకూ రసాలకూ, రస జగత్తులోని రసాలకూ భావాలకూ విశ్లేషణను ఇస్తున్నది. ఈ అభాసే కనుక లేకపోతే వాస్తవ జగత్తులోని భావాలూ రసాలూ రసజగత్తులోని భావాలూ రసాలూ ఒకటిగానే ఉండేవి. రసజగత్తుకు మూలమైన 'సౌందర్యం' అనే మూలకం కూడా ఈ అభాస అన్నది లేకపోతే మరో రూపాన్ని పొంది ఉండేది. అప్పుడు కళలలోని 'ఆదర్శ సౌందర్యం'లో 'ఆదర్శం' అన్నది లేకపోయి ఉండేదేమో.

అందుకని ఒక రకంగా ఆదర్శం - అభాసా అన్నవి అతి దగ్గర చుట్టాలేమో. లేకపోతే అవి ఏక గర్భజనితాలేనేమో మరి అందుకని రసజగత్తు అంతా వాస్తవ జగత్తుకు అందమైన అభాసా జగత్తే.

ఇలాంటి రసజగత్తులో లలితమైన కళ అని చెప్పబడే ప్రతిదీ వాస్తవ జగత్తులోని లాలిత్యానికి యదార్థ స్వరూపము. వాస్తవ జగత్తులోని వాస్తవానికి మధురమైనది ఈ అభాసా వాసవికత.

కళాకారుడు అంటే—

వాస్తవ జగత్తులోని మానవునికీ అతనిలోని గుణాత్మకతకూ అందమైన అభాసా రూపే, అభాసా గుణాత్మే.

అందుకని

వాస్తవంలో - అభాస అభాసగా కనిపిస్తుంది. అభాసలో వాస్తవం అన్నది, అందమైన వాస్తవంగా కనిపిస్తుంది.

కనుక

వాస్తవ జగత్తుకు రసజగత్తు అభాస.

రసజగత్తుకు వాస్తవ జగత్తు అభాస.

వాస్తవ జగత్తులోని వైజ్ఞానిక భావానికి రసభావం అభాస.

రసభావానికి వైజ్ఞానిక భావం అభాస.

మానవునికి కళాజీవి జీవితం అభాస.

కళాజీవికి మానవుడూ అతని జీవితమూ అభాస.

కనుక

ఈ జగత్తులోని కళాభూమిక మీది 'అభాస' అన్నది 'అభాసమైనది' కాదు.

అది ఒక మధుర అక్షణ లక్షణం. సుందరమైన ఓ ఆదర్శ పరిధి.

హిల్ కాలనీ

నల్లగొండ



# అబ్బూరివారి మల్లికాంబ

-ఎమ్. జయజీవితరాజు

నవ్య కవిత్వంలో ముఖ్యంగా చెప్పుకోదగిన ఉద్యమాలు రెండు. వాటిలో ఒకటి భావ కవిత్వం, రెండో దభ్యుదయ కవిత్వం. ఈ రెండుద్యమాలలోను భావ కవిత్వం ఇంచుమించు మూడు దశాబ్దాల కాలం పాటు ఆంధ్ర సాహిత్య క్షేత్రంలో బంగారు పంట పండించింది. శ్రీశ్రీగారు కూడ తొలిదశలో అనేక భావ కవితా ఖండికల్ని రచించారు. 1940 లోగా కలం పట్టిన వాళ్ళెవ్వరూ భావకవిత్వ ముద్రనుంచి తప్పించుకోలేక పోయారని చెప్పవచ్చు. ప్రముఖులైన భావ కవులలో అబ్బూరి రామకృష్ణారావు గారి కొక విశిష్ట స్థానం కలగదు

విషాదాంత కావ్యాలు తెలుగులోనూ, అటు సంస్కృతంలోనూ ఎక్కువగా లేవు ఇది గమనించిన కట్టమంచి రామలింగారెడ్డి గారు 1889 సంIIలోనే 'ముసలమ్మ మరణమనే చిన్నకావ్యాన్ని రచించారు. అయితే రెడ్డిగారి శుభప్రారంభం విషాదాంత గాథ. ఈ విషాదాంత కావ్య రచనల్లో రాయప్రోలు వారి డోరా. 'కష్టకమల.' 'తృణ కంకణం', 'స్నేహలతా దేవి', అబ్బూరివారి 'మల్లికాంబ', దువ్వూరి రామిరెడ్డి గారి 'నలజారమ్మ', వంటివి పేరు మోసినవి. అబ్బూరి రామకృష్ణారావు గారికి రామలింగారెడ్డిగారి సాంగత్యం మైసూరులో సమకూడింది. 'ముసలమ్మ మరణం' లోని అన్యాయాన్ని బట్టి స్ఫురించిన వేరొక అన్యాయాన్ని చూపడానికై అబ్బూరివారు 'మల్లికాంబ'ను రచించారు. రెడ్డిగారు బ్రౌను దొర ప్రచురించిన 'అనంతపుర చరిత్ర' లోనుంచి ముసలమ్మ కథను గ్రహించగా, ఆంగ్ల పత్రిక నొకదానినుంచి రామకృష్ణారావుగారు 'మల్లికాంబ' కథను గ్రహించారు.

ప్రస్తుతమగు మల్లికాంబ కథలో మల్లికాంబ, కమలలు స్నేహితురాళ్ళు. కమల అవివాహిత. మల్లికాంబ వివాహిత. కమల ప్రవాసములో నున్న తన ప్రియుడు రాసిన ఉత్తరాలను మల్లికాంబ దగ్గర దాచడానికై తెచ్చి ఇలా అంటుంది. "తనువు విలసిల్ల నూత్న చైతన్య మొసగు జీవకళలివి "ఫలియింపని నాదు కోరికల్ చెడుకోరి' యని నా యెడల గల నీ ప్రేమను పురస్కరించుకొని నీ కడ దాచడానికై తెచ్చాను. నా గురించి యిక్కట్లు పడవద్దు. లేనిపోని పరివాదాల్ని భరించవద్దు. అని ప్రేమలేఖల వల్ల కలిగే ప్రమాదాన్ని ముందుగానే ఎరిగినదానివలె కథా పరిణామాన్ని వ్యంగ్యంగా సూచిస్తూ 'యెట్లు దాచెదవో కాని చెలియ' అని పలుకగా, కమల మాటల్లోని ఆవేదనను గ్రహించిందై మల్లికాంబ కమలతో నాకిచ్చిన ప్రేమ లేఖలన్నిటిని భద్రంగానే దాస్తాను.'పరులకు చెప్పకుమీ' నా భర్తకు కూడ దొరకని రహఃప్రదేశంలో దాస్తానని తన స్నేహితురాలికి అభయమిచ్చి పంపివేసింది. కాని ఇక్కడ భర్తకు అవి దొరికితే ఏమవుతుందో అని కావ్యార్థ సూచియగు అనుమానం పాఠకులకు మెరుపువలె మెరుస్తుంది. అందుకే కాబోలు కమల ఈ విపత్తును ముందే తెలిసిన దానివలె వ్యంగ్యంగా చెప్పింది.

మల్లికాంబ తన సఖియ కమల ఇచ్చిన ముద్దు టుత్తరాలను ఒక మోహనపు పేటికలో ఇతరులెరుగని

విధంగా దాచింది. కాని తన భర్త వాటిని గ్రహించాడు. అక్కడితో ప్రారంభమైంది అతని మనో గోళంలో వ్యాకులత.

అతడు —

"అనుదినమ్మును నాకునైనను వచింప
రాని గోప్యము లే మందయాన కేల ?
అనుచు సందిగ్ధమౌ హృదయమ్ముతోడ
'దలపఁగా రాని తలఁపుల దలఁచె నతఁడు' —

ఈ విధంగా తలచరాని విధంగా తలచాడు. ఒకనాడు మల్లికాంబ ఇంట్లో లేని సమయంలో అతడు మల్లికాంబ దాచిన పత్ర సముదాయాన్ని కంపిల్లుతున్న హస్తంతో విప్పి సాంతం అందలి ప్రేమ వృత్తాంతాన్నెరిగి తన సతియె ఈ ప్రణయ మొనర్చిందని తలచి ఆమె పట్ల పెంచుకున్న మైత్రిని, వలపు తలపు లన్నిటిని తుంచుకొని ఆమె నవ్వుమోముని, సౌందర్యాన్ని మరువనెంచి కత్తితో చంపడానికి వెళ్ళి భార్య సమీపంలో విలపిస్తాడు. అతని ఉద్యమాన్ని గ్రహించిన మల్లికాంబ తత్క్షణమే తీవ్ర వేదనవల్ల మూర్ఛిల్లి అసువులు వాసింది. చెలియ మరణించిందన్న వార్త విన్న కమల ప్రణయ బాష్పజలాలర్పణ చేయడానికై సుడి వడుచు వచ్చింది. స్వప్నశేషాల వలె అదృశ్యమైన స్నేహబంధాలను, గతించిన చెలిమినీ తలపోస్తూ విలపించింది. భరింపరాని వ్యసన వ్యథతో కళ్ళనుంచి రాలే అశ్రువుల్ని ఒత్తుకుంటూ, మనసునందే తలపోస్తూ ప్రేమ నవ్యోదయ వేళలందు చెలియ దగ్గిర దాచుకున్న వలపుటుత్తరాలు జ్ఞప్తికి రాగా మల్లికా హృదీశ్వరుణ్ణి అడగడానికెళ్ళింది. కమల వల్ల నిజం తెలుసుకున్న పిదప అతడు నిర్విణ్ణుడై ఎక్కడికోవెళ్ళి పోయాడు. పోతూ పోతూ ఒక లేఖ కూడ రాసిపెట్టి పోయాడు. ఇది ఇందలి కథా సారాంశము షేక్స్పియరు మహాకవి రచించిన 'ఒథెల్లో' నాటకంలో కూడ ఇంచు మించుగా ఇట్టి కథావస్తువే వుంది.

ఈ కథలోని విషాదాన్ని ఈయని మెత్తటి రచన చక్కగా కప్పిపెట్టింది. కథలోని వాళ్ళందరూ ఈ లోకపు వ్యక్తులు కారు. కవితా లోకపు వ్యక్తులు. ఇది ఒక కవిత్వపు 'ఓపెరా' అనిపించిందన్నారు. కీ॥శే॥ శ్రీపాద గోపాలకృష్ణమూర్తిగారు. 'ఓపెరా'లో కథాగమనానికంటె నృత్య గానాదుల కెక్కువ స్థానం. దీనిలో కవి ఊహాపారావతపు రెక్కల చప్పుళ్ళు కథా గమనాన్ని మింగివేశాయి. అట్టి పెద్ద చప్పుడు కొక ఉదాహరణ- 'పాడి పాడి కోయిల తన గూడు చేరె'. కోయిలచేత గూడు కట్టించింది వారి భావనాసైరంధ్రి.

మల్లికాంబ నీ 'ఓపెరా' దృష్టితో పరిశీలిస్తే- తన వలపు టుత్తరాల్ని మల్లిక వద్ద దాచడానికిచ్చి తిరిగి వెళ్ళిపోయే సమయంలో మల్లిక-

వెళ్ళెదవుగాని యీ శిలావేది పైనిఁ
గొంతవడి కూరుచుండి తుళ్ళింత లొలయఁ
బాఱు సెలయేటి శ్రావ్య నిస్వనము లెల్ల
నాలకింపఁగవచ్చు రావమ్మ కమల! -అంటుంది.

కానీ ఆ నీటి తరగలు కమల మనోగత వికారాల్ని కలచినట్లయి, వ్యసన ప్రబోధాల వలె తోచాయి. ఇచట కవిగారు ఒకే విధమైన సెలయేటి నీటితరగల్ని ఒకరికి శ్రావ్య నిస్వనాల వలెను, మరొకరికి వ్యసన ప్రబోధాల వలెను చిత్రించారు. అనగా ఇచ్చట కేవల మనోభావానికి ప్రాధాన్యమివ్వబడింది. మానసిక అందోళనల్లో ఉన్న వారికి శ్రావ్యమైన ధ్వనులు కూడా రుచించవనుట సత్యం అంతటితో ఆగక మల్లిక ఇలా చెప్పసాగింది. ఆ సెలయేటిని చూసిన జాబిల్లి ప్రేమతో పరవశుడై సెలయేటిని నవ్వించటానికి ఆ యేటికి తెలియకుండానే తన హిమకరాలతో చక్కిలి గింత పెడుతున్నాడు.

"ప్రేమ బరవశుఁడగుచు జాబిల్లి తనదు
హిమకరములఁ జక్కిలిగింత లెఱుఁగకుండఁ
బెట్టుచున్నాడు సెలల నవ్వించు కొఱకుఁ
గాని వ్యసన ప్రబోధముల్ గావు కమల!" -కావున

వ్యసన ప్రబోధాలు కావు కమలా! అనగానే కమల-మోహ పారవశ్యాలసులైన వారికి యథార్థం గోచర మౌతుందా? ఏల వృథాశ్రమ పడతావు? అని కమలచే లోకసామాన్యమైన విషయాన్ని చెప్పించారు. కమల మనసులోని మర్మాలను బట్టి ఆమెకా విధంగా తోచ డం సహజం. సర్వసామాన్యంగా అట్టివారి కట్టి విధం గానే తోస్తుంది. ఇక్కడ ఒకే రమ్యమైన ప్రకృతిని రెండు మనసులకు రెండు విధాలుగా తోచేటట్లు వర్ణించి కవిగారు కృతార్థులయ్యారు. తదుపరి కమల తన ఇంటికి చేరుకుంటుంది. మల్లిక శోకలోక మణుమాత్ర మైనా యెరుగనిది. మానవతా మహిమలందు కొలను తామర పూవువలె మెలగేటటువంటిది. ఆమె భర్త కూడ రూపకులమ్ములందునను గాపగుణం కలవాడు. అట్టి తన భర్త ఒక మోహనపు పేటికలోని వలపు టుత్తరాల్ని చూశాడు.

ఒక వస్తువుపై ఒక వ్యక్తికి ప్రేమ ఉన్నపుడు, కారణాంతరాల వల్ల ఆ వస్తువుపై విరక్తి జనించిన పుడు ఎంత ప్రేమతో అతఃపూర్వమా వస్తువుని చూశాడో అంత తీవ్రమైన విరక్తి ఆ వస్తువు పట్ల జనించడం మానవ నైజం. ఇక్కడ వస్తువంటే మల్లిక. కేవలం ప్రేమ ఉండడం లేక పోవడం అనే రెండు కారణాల వల్ల ఆ వస్తువుకు లాభంగాని నష్టం గాని వాటిల్లుతుంది. ఈ సమయంలో మల్లికపై గల ప్రేమను చంపుకోడానికి ఆతని మనస్సు పడ్డ ఆవేద ననూ, మానసిక సంఘర్షణనూ, చక్కని భావనా శక్తితో కవిగారు అతనికి 'ఆమె మృదు తనూలత కాఠిన్య గదిత' మయ్యేటట్లు అతి రమణీయంగా వర్ణిం చారు. ఇదంతయు కేవలం ఆమెపై నున్న ప్రేమ నశించుట వల్లనే కలిగిన భావన.

ఈ కావ్యం లోతులకు పోతే కొన్ని సందేహాలు పొటమరించక మానవు. ఒకటి ఇక్కడ కమల అ వి వా హి త. మల్లికాంబ వివాహిత. వీళ్ళి ద్దరూ చిరకాల స్నేహితురాళ్ళు లేక బాల్య స్నేహితు రాళ్ళు అని కథనుబట్టి విదితమౌతుంది. ఇక, కమలకు లేఖలు రాసిన ప్రియుని పేరు ఈ కావ్యంలో ఎక్కడా కూడా చెప్పలేదు. పోనీ ఆతని పేరు అనవసరమను కొందాము. అతడు రాసిన లేఖార్థాలైనా కావ్యంలో కవిగారు ఎక్కడా చెప్పలేదు. రెండవది ఆ లేఖల్ని తన భర్తకు కూడా తెలవని రహస్యప్రదేశంలో దాస్తా నని కమలకు వాగ్దానమిచ్చింది కదా! మల్లికాంబ భర్త పేరు కూడ చెప్పలేదు. పోనీ ఇతని పేరు కూడా అనవసరమనుకొందాము. ఆ లేఖల సంగతి తన భర్తకు తెలిస్తే ఏమవుతుందో అనే సందేహమైనా కలగలేదు మల్లికకు. పోనీ భర్త మల్లికను చంపడా నికి వెళ్ళినప్పుడైనా ఆ లేఖలు తనవి కావని చెప్పొచ్చు కదా. కాని చెప్పలేదు. అంటే ఇక్కడ తన ప్రాణాన్ని గూడా లెక్కచేయకుండా తన చెలికిచ్చిన వాగ్దానాన్ని కాపాడుకోవడమేగాక వారి స్నేహానికొక పరమార్థాన్ని పరిపూర్ణత్వాన్ని కలగజేసింది. మరొక గమనించదగ్గ విషయం ఆ లేఖల్ని మల్లికాంబ భర్త చదివినప్పుడు ఆ లేఖల్లో ప్రియుని పేరుగాని, ప్రియురాలి పేరుగాని, ఉండాలి కదా! అంటే సంబోధన గూడ లేని లేఖ లేమోనని ఊహించవలసి వస్తుంది. కాని కించిదాలో చిస్తే పై సందేహాలకు నివృత్తి దొరక్కపోదు మొదటిది ఆ లేఖల్ని మల్లిక తన భర్తకుగూడ తెలియ కుండా దాచవచ్చుననుకుని ఉంటుంది. రెండోది తన ప్రవర్తన మీద భర్తకుగల అభిమానాన్ని ప్రేమాను బంధాన్ని పురస్కరించుకొని భర్త తన్ను అనుమా నించడనే అభిప్రాయం కల్గి ఉంటుంది. మూడోది ఆ ప్రణయ లేఖల్లో బహుశః ముగింపులో మాత్రమే ప్రియుని పేరుండి ఉంటుంది. ప్రారంభంలో ప్రేయసీ! అనే సంబోధన మాత్రమే ఉండి యుంటే మల్లికాంబ భర్త అనుమానించడంలో దోషం లేదు. నాలుగోది ఆ వలపు టుత్తరాలు తనవి కావని చెప్పడానికి అవకా శమే దొరకలేదు. ఎందుచేతనంటే యముని వలె కన బడ్డ భర్తను చూసి ఆమె మూర్ఛిల్లి మరణించింది. ఇన్ని విషయాల్ని మరుగునబెట్టి కవిగారు కావ్యార్థం లోనారసినచో బోధ పడే విధంగా రచించారు.

ఈ కావ్యంలో అబ్బూరి వారు పాత్రల మానసిక ప్రవృత్తుల్ని, సంఘర్షణల్ని చాలా చక్కగా చిత్రించారు. కమలకు మల్లికాంబకు జరిగిన సంభాషణల్లో ప్రణయతత్వం చెప్పబడింది. తన ప్రేమ ఫలిస్తుందో లేదో యనే శంకతో కమల చింతిస్తూ ఉంటుంది. కాని మల్లిక శోక లోక మణుమాత్రమైన ఎరుగనిది. కావున ఈమె ప్రకృతి శోభల్ని చూసి ఆనందించగల్గుతుంది. మోహపారవశ్యురాలైన మల్లిక తన నేస్తాన్ని కూడ చూసి ఆనందించమంటూ ప్రకృతి రామణీయకతను వివరిస్తుంది. సెలయేటి వర్ణన చేస్తుంది. సెలయేటి లోని నీటి తరగలు కలవరపడి పోతూన్నపుడు వాని చప్పుళ్ళు శ్రావ్య నిస్వనాల వలె మల్లికకు తోచగా రావమ్మ కమల ఆలకించగ వచ్చునని పలుకుతుంది. ఈ ధ్వని శాంత మనస్కులు, ఆనంద మనస్కులైన వారికట్టి విధంగా తోచడం సహజమే, కాని వ్యాకుల మనస్కులు, చింతామనస్కులైన వారికట్టి విధంగా తోచదు కదా ! అందువల్లనే కమల కీ విధంగా తోచింది. సెలలను నవ్వించేందుకై ప్రేమ పరవశుడైన జాబిల్లి సెలయేటికి తెలియకుండానే తన హిమకరాలతో చక్కిలిగింత పెట్టుతున్నాడని అనగా కమల-

"ఏల వృథాశ్రమం బడెదవే నవమల్లిక
మోహ పారవ
శ్యాలసులైన వారికి యథార్థము గోచరమౌనె ?
మోహలీ
లాలలితమ్ములైన కళలం గను పట్టెదు, గాకసృష్టి;
చా
ల్జాలు నుపన్యసింప కబలా : మతికెక్కని సృష్టి;
శోభలన్-"

ఈ విధంగా సృష్టి శోభలన్నీ ఆమె మతికెక్కని వయ్యాయి. అనగా మన మనోలీనమైన మమ్మలను పోలి ప్రకృతి పరిణామ దశలు మనకు కనబడతాయి. ఈ విధంగా మల్లికా కమలల సంభాషణల్లో మన శ్చిత్త వృత్తులతో పాటు ప్రణయతత్వం కూడ చెప్ప బడింది.

మల్లికని అనుమానించిన భర్త ఆమెను చంప నుద్యమించినపుడు బహుకాలం నుంచి పూజించినట్టి అనగి పెనగి మైత్రిని పెంచికొన్నట్టి వలపు తలపుల్ని ఆ చిగురు బోడి నవ్వు మోముని, సౌందర్యాన్ని మర్చిపోయి ఆమెను వధించడం బహుదుర్లభమై పోయిందతనికి. అట్టి సందర్భంలో అతని మానసిక ఊగిసలాటను, ప్రవృత్తినీ చక్కగా చిత్రించారు. 'భావమా యేల చంచలత్వమ్ము నీకు'—నిర్ణయ మొనర్పలేవొ యింతిని వధింప', అని బేలపోతాడు.

మల్లిక మరణవార్త విన్న కమల ప్రణయ బాష జలాంర్పణ చేయడానికై వచ్చింది. తమ స్నేహ బంధాలన్నీ స్వప్నశేషాలవలె అదృశ్యాలైనాయని విల పించింది. కళ్ళ నుంచి ఓడిక కట్టు అశ్రువుల్ని ఒత్తు కుంటూ విషణ్ణయై ప్రేమనవోదయ రహస్యవేళల్లో చెలియకడ దాచుకొన్నట్టి వలపు టుత్తరాలు జ్ఞప్తికి రాగా వేగంగా మల్లికాహృదీశ్వరుని చెంతకు చేరి అసలు విషయాన్ని తెలపగా అతడు తను చేసిన పనికి పశ్చాత్తప్తుడై ఎటకో వెళ్ళిపోయాడు.

ఈ కావ్యంలో సాయంత్రం వర్ణన ఒకటి, ప్రభాత వర్ణన మొకటి ఉన్నాయి. సాయంత్రం వర్ణన మొక నాడు మల్లిక కమలతో కేళీసాంగత్యం సలిపి వస్తూన్న సమయంలో వర్ణించబడింది.

'నల్లదలఁ గ్రమ్మె సాయంతనంపు టిరులు
నీలగాదంబినీ జవనికల వెనుక
మినుకు మినుకను తారకాగణము లెల్ల
మందకళల వెలార్చె నంబరము నందు.'—ఈ

విధంగా సాయంత్ర మయ్యేసరికి చీకట్లు నాలుగు దిక్కులందు క్రమ్మాయి. మినుకుమినుకుమంటున్న తారకా గణాలెల్ల ఆకాశంలో మందకళల్ని వెలార్చు తున్నాయి. మరియు

'రసవహాలా పగతినొక రమ్యగీతిఁ
బాడిపాడి కోయిల తనకుఁ జేరె :
మంజు గానము రాగ ప్రమత్తమైన
కాపు కన్నె మందలతోడఁ గదలి చనియె'-చీకటి

పడుతున్న కారణంచేత కోయిలలు గూళ్ళు చేరాయి. కాపు కన్నెలు మందల్ని తోలుకొని పోతున్నారు. ఇంకా-

'వచ్చియును రాని పలుకుల ముచ్చటించు
వలపు బిడ్డల కన్నముఁ గలిపి తెచ్చి
మాయ మాటల మ్రింగించు మాతృవచన
గతులు తోఁచె గృహారామతతులయందు.'—

సాయంత్ర మవటం చేత గృహారామాలందు తల్లులు తమ పిల్లలకు మాయ మాటలు చెప్పి అన్నం తినిపిస్తున్నారు 'అంతయు శాంతంబయ్యె' అనుటతో చీకటి అలముకొన్నదని తెలుస్తుంది. ఈ విధంగా సాయంత్ర మయ్యేసరికి జనులు ఏయే కార్యక్రమాలు ఎలా ముగించుకుంటారో చక్కగా వరుసగా వర్ణించబడింది.

రెండో వర్ణన ప్రభాత వర్ణన. ఈ వర్ణన మల్లిక మరణానంతరం చేయబడింది. ఈ ప్రభాత వర్ణనం కథానుగుణంగా కూడా ఉంది.

'దీప్తి రథ మెక్కి ధర కరుదెంచు చున్న
చిత్రభానుని స్వర్ణకౌశేయ మదిగో:
ఉదయ పవనములం దాడుచుండె దివిని
గగన సీమంతినియు నవ్వుఁ గనులఁ దెఱచి'—

అనగా సూర్యుడు దీప్తి అనే రథాన్నెక్కి భువి కేతెంచుచున్నాడు. సూర్యోదయానికి ముందు కొన్ని నిమిషాలు ఆకాశం అంతా ఎరుపు రంగులోఉంటుంది. అది స్వర్ణకౌశేయ మట చిత్రభానుడికి. అట్టి స్వర్ణ కౌశేయం ఉదయ పవనములం దాడుతోందట దివిని, గగన సీమంతిని కళ్ళుతెరచి నవ్వుతోందట. ఇంతటితో సూర్యోదయమైంది. ఆ సూర్యకిరణాలు తోట మధ్యలో నున్న పుష్పాలు సూర్యుడికి మందహాసాంజలుల్ని చేస్తున్నా గమనించక ఆ కిరణాలు వేటినో వెదకుతున్నట్లు ప్రసరిస్తున్నాయి. ఇది మల్లిక భర్త మల్లిక కోసం వెదకుతున్న తీరును విశదపరస్తుంది.

'తోట నడుమల నూత్న కాంతులను- గుసుమ
మందహాసాంజలులఁ బ్రజాము మ్రొక్కనర్చు
వల్లివనజాస్య సుఖపరవశతఁ గనక
తరణి వెదకుచున్నాఁడు కరము లార్చి'— ఈ

విధంగా అతడు కరములార్చి మల్లికను వెదక సాగాడన్నట్లుంది

అబ్బూరి వారి కవిత్వంలో చక్కని పదాల పొందిక ఉంది. వారు కన్నీటిని వర్ణించే సందర్భంలో కన్గొనల నుంచి పొంగి పొరలే బాష్పవృత్తుల్ని 'సోనల'తో పోల్చారు. పూర్వ కవులనేకులు కన్నీటిని వర్ణించారు గాని వారు ఇంత చిన్న ఉపమానాన్ని ఎన్నడూ తీసుకోలేదు. వారు గంగానదీ ప్రవాహాల తోను, కట్టలు తెంచుకొని ప్రవహించే సెలయేళ్ళ వలెను మున్నీరుగను వర్ణించారు. అది అతిశయోక్తితో కూడినటువంటిది. కన్నీరు "సొనల" వలె అనడం వల్ల "సొన" అనేది పరిమాణంలో చాలా తక్కువ. కన్నీరు కూడా పరిమాణంలో ఎంత ఏడ్చినప్పటికీ కాలువ కాలేదు కదా. "సొనల" వలె అనటంవల్ల సహజత్వానికి దగ్గరగా ఉన్నట్లుంది. అందు చేతనే కాబోలు శ్రీ శ్రీ గారు వీరిని "టెక్నీషియన్" అని పేర్కొన్నారు. కపిల కాశీపతి గారు మాటల్ని రత్నాలు లాగ పొదుగుతారు అబ్బూరివారు. అందుకే నేను అబ్బూరి వారిని 'శిల్పి' అంటాను అన్నారు. మరో సందర్భంలో "కన్నులందొడిక కట్టునశ్రువులు నొత్తుచు" అని సాభిప్రాయంగా వాడారు, వీరి కవిత్వంలో కొన్ని నూత్నప్రయోగాలు కన్పిస్తాయి. ఒడికారితనము, నీరదకుమారిక, వాంఛావిమానములు, మతికెక్కని సృష్టిశోభలు మొదలైనవే గాక, ముద్దుటుత్తరములు, హస్తపల్లవములు, వంటి లలిత లలితమైన పదజాలంతోను, నిషణ్ణమై" వంటి నైఘంటుక

పదాలతోను, కాలశాంభవుడు, కాలకుడిలుడు, వంటి సాంప్రదాయక పదబంధాలతోను ఈ కావ్యమలరారుతున్నది.

ప్రణయ లేఖల కారణం వల్ల కలిగిన భ్రాంతిచే పండువంటి సంసారంలో కలిగిన ఉపద్రవాన్ని చూపడమే కాక దీనిలో ప్రాణస్నేహితులకొక బోధ ఉంది స్నేహానికొక ఉత్కృష్ట స్థానాన్ని కల్పించుటయే కాక మల్లికా కమలలు రహస్యంగా దాచిపెట్టుటకి ఆ లేఖల విషయం చివరకు బహిర్గతం కాక తప్పదనే నిజం నిలకడమీద తెలుస్తుంది కదా; ఈ వాస్తవాన్ని చాటి లోకంలో కవితాలోకంలో తనకొక విశిష్ట స్థానాన్ని ఏర్పరచుకోగలిగారు శ్రీ అబ్బూరివారు *

తెలుగుపరిశోధక విద్యార్థి
ఆంధ్ర యూనివర్సిటీ
వాల్తేరు.

# "బాపూస్మృతి"

-కొంగే సుధాకరరావు

క॥ హత్యల హింసల మాన్పుచు
సత్యాహింసలను పెంచి సజ్జను డగుచున్
నిత్యమ్ము వెలిగె సుమహత్
కృత్యము లొనరించి గాంధి కృతకృత్యుడుగా!

క॥ మహనీయ మన స్తత్వము
స్పృహణీయమ్మైన బుద్ధి స్ఫురియింపంగా
అహరహము విఘ్నములందా
సహనమ్మొనరించె గాంధి సాత్వికుడగుచున్

క॥ నిర్మల గుణదున్ శాస్త్రపు
మర్మమ్ములఁ నెఱుగు వాడు మాన్యుడు విలసత్
ధర్మనిరతుడౌ ఋషి. సత్
కర్మ పరాయణుడగు గాంధి కమనీయుండున్

క॥ తెల్లదొరల పరిపాలన
మెల్లగ తొలగించి భరత మేదిని లోనన్
చల్లని స్వతంత్ర లక్ష్మిని
అల్లన రప్పింప జేసె నాత్మబలమునన్

క॥ కరుణాపూర్ణుడు 'బాపూ'
చరణములే శరణు నాకు చారిత్రక సత్
పురుషవరేణ్యుడు నాతని
స్మరణము సేసెదను హృదయ మందున భక్తిన్.

క॥ మోహము, అధికారాశా
దాహము, దర్పమ్ము లేదు; దంభము లేదే
మోహనదాసుని చిత్తము
సహనము, శాంతులకు నిత్య సంగమము కదా !

సదాశివపేట,
ఆదోని.

# కథాంగాలు - ఒక పరిశీలన

—వల్లంపాటి వెంకటసుబ్బయ్య

కథను నిర్వచించాలని ప్రయత్నించటం గాలిని గుప్పిట్లో బంధించాలనుకోవటం లాంటిది. నిర్వచనం పరిధిని ఎంత విశాలంగా పెంచినా ఆ పరిధిలోకి రాని కొన్ని గొప్ప కథలు మిగిలిపోక తప్పవు. ఇది సహజమే కాక సంతోషదాయకం కూడా. అనంతమైన వైవిధ్యం ఉన్న మానవ ప్రవర్తనకు అత్యంత సమీపంలో ఉన్న సాహిత్య ప్రక్రియ కథ. అందుచేత అది నిర్వచనాలకు లొంగకపోవటంలో ఆశ్చర్యంలేదు. అంతేకాక ఆ నిర్వచనాలు అలంకార సూత్రాలుగా మారి రచయిత సృజన శక్తికి సంకెళ్ళుగా మారే ప్రమాదం లేకపోవటం సంతోషదాయకమే. ఈ విషయాన్నే సుప్రసిద్ధ కథారచయిత H E. Bates ఇలా చెప్పారు. - "The short story can be anything that the anthor decides it shell be." కానీ కథను అర్థం చేసుకోవటానికి పద్ధతులే లేవనుకోవటం గూడా పొరపాటే. అందుచేత వర్ణనాత్మకంగా ఉన్న కొన్ని సూత్రాలను (descriptive principles) రూపొందించుకోవలసిన అవసరం ఉన్నది.

సమాజంలో మధ్యతరగతి, సాహిత్యంలో నవల ఏకకాలంలో పుట్టాయి. మధ్యతరగతి నాగరికత అభివృద్ధి చెందినకొద్దీ అంతకు పూర్వం ఆవశ్యంగా ఉన్న "హీరోయిజమ్" క్షీణించసాగింది. మధ్యతరగతి కోసం పుట్టిన నవల మధ్యతరగతి జీవితానికి అద్దం పట్టసాగింది. "హీరోయిజమ్"కు ప్రాధాన్యత తగ్గటంతో దాన్ని చిత్రిస్తూ ఉండిన మహాకావ్యం (epic) కూడా మరుగుపడిపోసాగింది. సాహిత్యంలో పరాక్రమ వర్ణన (external action) తగ్గుతూ మానసిక వర్ణన (internal action) హెచ్చుతూ రాసాగింది. ఈ పరిణామాల తీవ్రతకు పత్రికల ఒత్తిడి జత కావటంతో కథ పుట్టుక అవసరమైంది. అది "హీరోయిజమ్" ఎంతమాత్రమూ లేని సామాన్య మానవుణ్ణి తన ప్రధాన వస్తువుగా గ్రహించింది.

కొందరు విమర్శకుల అభిప్రాయం ప్రకారం కథ మానవుని ఏకాంత జీవితాన్ని చిత్రించటానికి మాత్రమే ఉద్భవించింది. కథలో "ఏకాంత" జీవితానికి ప్రాధాన్యత ఉన్నమాట నిజమే కానీ, కేవలం ఏకాంత జీవితాన్ని చిత్రించటమే కథ లక్ష్యం అనటం పొరపాటే. ఈ అభిప్రాయంలో మానవుని ఏకాంత జీవితానికి, సమాజానికి ఎలాంటి సంబంధమూ లేదన్న అభిప్రాయం గర్భితమై ఉంది ఇందులో సత్యం ఎంత మాత్రమూలేదు సమాజంలో ఉన్న మానవుడు, సమాజంతో సంబంధం లేకుండా ఏకాంతజీవిగా బ్రతకటం అసాధ్యం. అందుచేత సాహిత్యప్రక్రియగా కథ మానవుని ఏకాంత జీవితానికి, సామాజిక జీవితానికి ఉన్న సంబంధాలను, వైరుధ్యాలను చిత్రిస్తుందని చెప్పవచ్చు.

కథ చెప్పటం ఎంత ఆధునిక ప్రక్రియో అంత ప్రాచీనమైంది కూడా. ప్రతి సాహిత్యంలోనూ ఎంతో ప్రాచీనమైన కథాసాహిత్యం ఉంది. బైబిల్‌లోనూ, వేదోపనిషత్తులలోనూ ఎన్నో మంచి కథలున్నాయి. కథ వినాలన్న కుతూహలం మానవ ప్రకృతిలోనే ఒక భాగం. కానీ తెలుగు కథ వేదోపనిషత్తులలో నుంచి ఉద్భవించిందన్న వాదంలో చారిత్రక దృష్టి లేదు.

ఆధునిక సాహిత్య ప్రక్రియగా ఈనాడు మనం పరిగణిస్తున్న కథకు, కథాసరిత్సాగరం, భేతాళ పంచవింశతి, శుకసప్తతి, కాశీమజిలీ మొదలైన కథలకు వస్తువు (content)లో రూపం (form)లో ఉన్న భేదాలను తెలుసుకోవటం చాలా అవసరం. పాత కథలో శిల్పం లేదు. కొత్త కథలో శిల్పం ప్రధాన అంశం. దాదాపు పాత కథలన్నీ "హీరో"ను కేంద్రంగా చేసుకొని అతని సాహస, శృంగారాల చుట్టూ అల్లబడ్డవే (కొన్ని పద్ధతుల్లో వ్యభిచరించటల మాత్రమే లక్ష్యంగా ఉన్న స్త్రీలు కూడా కనిపిస్తారు.) ఈ కథలు external actionమీద ఆధార పడటం వలన పాత్రల మానసికప్రవర్తనకు వీటిలో అవకాశము లేదు. కానీ కొత్తకథలో "హీరో"కు చోటులేదు పాత్రల మానసిక జీవితాన్ని చిత్రించటం యిందులో మరొక ప్రధానమైన అంశం. పాతకథలో పాత్రలకు దేశ కాలాలు (Time and Space) లేవు. కాబట్టి అందులో సమాజ చిత్రణకు గూడా ప్రాధాన్యత లేదు. కొత్త కథలో ఈ రెండు అంశాలకూ చాలా ప్రాముఖ్యత ఉంది. కొత్త కథకు తక్షణత్వం (immediacy) ప్రాణం. వాస్తవికత దాని ప్రధాన లక్షణం. ఈవిషయాలను దృష్టిలో ఉంచుకొని పరిశీలిస్తే తెలుగు కథ ఆంగ్లసాహిత్యంతో మనకు ఏర్పడ్డ సంపర్కం వల్ల పుట్టిందని తెలుస్తుంది. పాశ్చాత్య విమర్శకులు కూడా 1832జనవరిలో ఎడ్గర్ ఆలెన్ పో "శాటర్‌డే కురియర్" అన్న పత్రికలో "మెట్ జకగన్ స్టయిన్" అన్న కథను ప్రకటించటంతో కొత్త కథ ప్రారంభమైందని అంగీకరిస్తారు. కథ ఈనాడు సామూహిక కళ కాదు. తెలివితేటలు, విమర్శనా శక్తి ఉన్న పాఠకుణ్ణి ఆకట్టుకోవటానికి ప్రయత్నిస్తున్న వ్యక్తిగత కళారూపం ఈనాటి కథ.

కథ బయటి రూపాన్ని (external form)ను అర్థం చేసుకోవటానికి దాన్ని నవలతో పోల్చి పరిశీలించటం సులువైన పద్ధతి. నవల ఒక పాత్ర జీవితాన్ని, లేదా ఒక జీవిత పద్ధతిని- ఇలా ఎన్నింటినో కూలంకషంగా చిత్రిస్తుంది. సామాన్యంగా నవల తీసుకునే కాలపరిధి ఎక్కువగా ఉంటుంది. (ఒక్క రోజును మాత్రమే చిత్రించిన నవలలు లేకపోలేదు) కానీ కథ ప్రధానంగా ఒక పాత్ర, ఒక సంఘటన లేదా ఒక భావం మీద ఆధారపడి ఉంటుంది. ఇతర పాత్రలు, సంఘటనలు, భావాలు ఉన్నా కథా వస్తువును వ్యక్తం చేసే కేంద్రబిందువు ప్రాధాన్యతను నిరూపించటానికి మాత్రమే ఉపయోగ పడుతాయి. కాలపరిధి, పాత్రలు, జీవిత చిత్రణ- వీటి విస్తృతి క్రమంగా నవలికలో తగ్గి, యిక ఏ మాత్రమూ తగ్గటానికి వీలులేని చోట కథలో ఆగిపోతుంది. ఇది విస్తృతికి సంబంధించిన వివరణ మాత్రమే. అంతే కానీ నవలను కుదిస్తే కథ, కథను పొడిగిస్తే నవల ఎంత మాత్రమూ కావు. నవల జీవితాన్ని పెద్ద లైటు వేసి కనుచూపు ప్రసరించినంత మేర చూపితే, కథ శక్తివంతమైన చిన్న టార్చిలైటువేసి జీవితంలో ఒక బిందువును ఒక జీవిత శకలాన్ని చూపుతుంది నవల యిచ్చే అనుభూతి తీవ్రతను కథ మాత్రమే యివ్వ గలుగుతుంది. మంచి కథలో ఆ జీవితశకలం ఆ కథలో చిత్రించ బడుతున్న జీవితానికి లేదా పాత్రకు మచ్చుతునక (sample)గా ఉంటుంది. ఆ శకలాన్ని ఆధారం చేసుకొని కథ వెనుక ఉన్న కథను- కథావస్తువును- పాఠకుడు ఊహించే అవకాశాన్ని రచయిత తన శిల్ప నైపుణ్యంతో కల్పిస్తాడు ఇలా కథా వస్తువు, పాత్రలు, కాలవ్యవధి మొదలైన అంశాలలో క్లుప్తత కథకు ప్రాణ భూతమైన గుణం. ఇది నిడివికి సంబంధించిన విషయం కాదు, శిల్పానికి సంబంధించిన విషయం. ఈ విషయాన్ని రెండు నుంచి యాభై, అరవై పుటలదాకా నిడివి ఉన్న ఎన్నో గొప్ప కథలు నిరూపిస్తాయి. అనవసరమైన పాత్రలు, సంఘటనలు, వర్ణనలు, రచయిత తనకు తానుగా కథనంలో జోక్యంచేసుకొని చేసే వివరణలు కథా శరీరానికి సరిపడని విషయాలు. ఇవి ఎక్కువగా

ఉన్న కథ-ఎంత మంచివస్తువును కలిగివున్నా-గొప్ప కథ అనిపించుకోదు. కథకు ప్రాణంలేదు, ఛందకావ్యం తోను పోలుస్తూ సుప్రసిద్ధ కథా రచయిత విలియమ్ ఫాక్నర్ యిలా అన్నాడు.

"In a short story, that is next to the poem, almost every word has get to the almost exactly right, In the novel you can be careless but in the short story you can't. you have less room to be slovenly and careless. There is less room in it for brash. In poetry. of course, there is no room for trash.

అందుచేతనే తప్పువరకం రచయిత నవలాకారు డయ్యే అవకాశం వున్నదేమో కానీ, కథారచయితయ్యే అవకాశం లేదు. కథలో క్లుప్తత తనంతకు తానుగా రూపొందదు. రచయిత దీన్ని ఎంతో శ్రమించి సాధించవలసి ఉంటుంది. పాఠకుని ఆలోచనా శక్తికి కథలోని క్లుప్తత పదును పెడుతుంది. సాధారణంగా మంచి పాఠకుడు చదివి మరచిపోయే కథలు క్లుప్తత లోపించినవిగా ఉంటాయి. ఇలా నవలలోని వస్తువు రూపాన్ని నిర్ణయిస్తే, కథయొక్క రూపం వస్తువును నిర్ణయిస్తుంది.

కథలోని నడక (Progression) ప్రారంభం, వివరణ, ముగింపు (లేదా ఆది మధ్యాంతాలు) అన్న మూడు సూత్రాలమీద సాధారణంగా ఆధారపడివున్నా అవి సర్వే సర్వత్ర సత్యం కాదు. చెకోవ్, కాఫ్కా, చాసో రాసిన ఎన్నో గొప్ప కథలకు ఆద్యంతాలు లేవు మధ్యభాగం మాత్రమే ఉంది. కాబట్టి ఈ సూత్రాలు కథనపద్ధతిని అర్థంచేసుకోవటానికి కొంత వరకూ ఉపకరించినా కథను విలువకట్టడానికి అంతగా పనికిరావు. వీటిమధ్య వుండవలసిన సమన్వయాన్ని పరిశీలించకపోతే కథవిలువ తారుమారయ్యే అవకాశం కూడా ఉంది. వీటిని మించి కథ సాధించవలసిన లక్షణం జేమ్స్ జాయిస్‌మాటల్లో చెప్పాలంటే-ఎపిఫనీ (epiphany). ఈ మాటకు క్రైస్తవ తత్త్వ శాస్త్రంలో సాక్షాత్కారమని అర్థం. పాఠకుడు కథను చదవటం పూర్తిచేశాక, అన్ని శిల్పవిషయాలూ కలిసి అతనిలో కథా వస్తువుపట్ల కలుగజేసే "ఎరుకను" "ఎపిఫనీ" అని చెప్పవచ్చు. కానీ యిది కథ చెప్పే "నీతి" కాదు. ఓ హెన్రీ లాంటి వారి కథల్లో కన పించే "కొసమెరుపు" కూడా కాదు. చాలామంది దృష్టిలో ఈ "ఎపిఫనీ" కలిగించలేని కథ గొప్పకథ కాదు.

కథను కథా వస్తువు, కథారూపం అని రెండుభాగా లుగా విభజించవచ్చు వస్తువును ఎన్నుకోవడంలో కథా రచయితకున్న స్వాతంత్ర్యము, సౌలభ్యము యితర సాహిత్యకారులకులేదు. కానీ కథావస్తువు మాత్రమే కథ కాదు. వస్తువుకు అనుగుణమైన రూపం కుదిరినప్పుడు మాత్రమే మంచి కథ రూపొందుతుంది. కథావస్తువు యొక్క మూర్తరూపమే (concrete shape) కథ. కథావస్తువును కథగా మార్చేది రూపమే. కథా రూపం ద్వారానే పాఠకుడు కథావస్తువును అర్థం చేసుకుంటాడు. అనుభవిస్తాడు. రూపం సరిగా కుదరని కథలో కథావస్తువుకు సంబంధించిన అనుభూతి గలు గదు. అందుచేత కథారూపాన్ని అర్థంచేసుకోవడానికి కొన్ని సూత్రాలను రూపొందించుకోక తప్పదు.

కథరూపాన్ని పాత్రలు, ప్లాట్ (plot), వాతా వరణం (setting), దృష్టికోణం (point of view), కంఠస్వరం (tone), కథన పద్ధతులు (made of narration) అన్న ఆరు అంశాలుగా భాగించి అర్థంచేసుకోవచ్చు. ఈ ఆరు అంశాలనూ కలిపి స్థూలంగా "శిల్పం" అన్న పేరుతోకూడా వ్యవహరించడం జరుగుతూ ఉంటుంది.

కథావస్తువు రచయిత జీవితంలోంచి పుట్టవచ్చు. లేదా తనకు తెలిసిన యితరుల జీవితాలలోంచి గానీ, తన చదువులోంచి గానీ రచయిత కథా వస్తువును గ్రహించవచ్చు. కథావస్తువు కళకాదు, కానీ కళగా మారుతుంది. వీటి మధ్య ముడి బంగారానికి, అంద

పైన నగకు ఉన్నంత తేడా ఉంటుంది. బంగారాన్ని నగగా స్వర్ణకారుని హస్త నైపుణ్యం మారుస్తుంది. అలాగే కథావస్తువును కళా విలువ కలిగిన కథగా రచయిత శిల్పనైపుణ్యం రూపొందిస్తుంది. శిల్పంలేని కళ ఉండదు. కానీ ఉత్తమ శిల్పం సహజంగా, ఆడంబరం లేకుండా, అదృశ్యంగా, నాజూకైన అలంకరణలా ఉంటుంది. కథా వస్తువుయొక్క అవసరాలకు మించిన శిల్పం- శిల్పాడంబరం- కథ యిచ్చే అనుభూతిని పాడు చేస్తుంది.

కథావస్తువును ధరించేవారు లేదా అనుభవించే వారు కథలోని పాత్రలు. కథలోని పాత్రలకు, నవలలోని పాత్రలకు కొన్ని తేడాలు గూడా గమనించవచ్చు ఒక రకంగా అసాధారణ మానవ ప్రవర్తన కథకు ముడిసరుకు. ఈ దృష్టితో చూచినప్పుడు మంచితనానికి మారుపేరైన వారు, బలహీనతలు లేని వారు, ఒక్క మాటలో- ఎలాంటి సందర్భంలోనైనా సమాజం ఆమోదించే టట్టు మాత్రమే ప్రవర్తించే వారు కథల్లో మంచి పాత్రలుగా రూపొందటం చాలా అరుదు. మంచి చెడ్డలు, నీత్యవినీతులు, వినయ విప్లవాలు మొదలైన ద్వంద్వాల సరిహద్దురేఖ మీద ఉన్న మానవులే మనకు కథల్లో ఎక్కువగా కనిపిస్తారు. రచయిత కర్తవ్యం అసాధారణ మానవ ప్రవర్తనను చిత్రించి పాఠకుణ్ణి ఆశ్చర్యపరచటం కాదు. ఆ ప్రవర్తన వెనుక ఉన్న సామాజిక మానసిక కారణాలు చూపించటం. కథ ప్రముఖంగా వాస్తవికత మీద ఆధార పడ్డ సాహిత్యప్రక్రియ కాబట్టి పాత్ర పోషణ కూడా అదే మార్గంలో ఉంటుంది. అందుచేత పాత్రలకు దేశకాలాలు (space and time) తప్పకుండా ఉండాలి. వీటిని పాటించని రచయితలు (పాత్రల్ని సంకేతాలుగా వాడుతుంటే తప్ప) సమాజాన్ని తిరస్కరిస్తున్నారు. మంచి పాత్ర ఒక ప్రాంతానికి, మతానికి, కులానికి, వర్గానికి, భావానికి ప్రతినిధిగా ఉంటూగూడా తనప్రత్యేకతను నిలబెట్టుకోగలిగి ఉంటుంది. అంటే మంచి పాత్ర type గానూ individual గానూ గూడా వ్యవహరిస్తుంది. కథలో పాత్రను ఆవిష్కరించటానికున్న వ్యవధి, పరిధి చాలా తక్కువ కాబట్టి, రచయిత ఎన్నుకునే ఒకటి రెండు సంఘటనలు పాత్ర స్వరూపాన్ని సంపూర్ణంగా ఆవిష్కరించ గలిగి ఉండాలి.

కథలోని రెండవ అంగం "ప్లాట్"(plot). దీన్ని కథలో జరిగే సంఘటనల వరుసగా వర్ణించవచ్చు. రచయిత పాఠకునిలో ఉత్సుకతను రేపటానికి సంఘటనల్ని తారుమారు చేసినా అందులో కాలక్రమం తప్పకుండా ఉంటుంది. ఇది కథా వస్తువుకు అనుగుణంగా సరైన చోట ప్రారంభమై, సరైన చోటనే ఆఖరు కావాలి. ఆద్యంతాల మధ్య సమన్వయం ఉండాలి. లేకపోతే కథకు ప్రధాన లక్షణమైన క్లుప్తత లోపిస్తుంది మరోరకంగా చూచినప్పుడు కథలోని యితర అంగాలైన వస్తువు, పాత్రలు, టోన్(tone) మొదలైన వాటికి కూడలి "ప్లాట్". ఇలా కథలోని ఐక్యత (unity) బహుశా "ప్లాట్" తో ప్రారంభమౌతుంది. కథలో వర్ణించబడిన అనేక సంఘటనల మధ్య ఉన్న కార్యకారణ సంబంధాన్ని చూపించటం "ప్లాట్" నిర్వహించ వలసిన ప్రధాన కర్తవ్యం. నవలలోను కథలోను పాత్రల మనసులోతుల్లోని భావాలను మాత్రమే ఆవిష్కరించాలని ప్రయత్నించిన రచయితలు, మానవ జీవితం అర్థరహితమైందని, అందులో కార్య కారణ సంబంధం (causality) లేదని భావించిన ఒక రకం అస్తిత్వవాద రచయితలు "ప్లాట్" కు కథారచనలో ప్రాధాన్యత లేదని భావించారు. ఈ అభిప్రాయం చైతన్య స్రవంతి రచనా పద్ధతికి, అసంగత నాటకానికి (absurd drama) దారితీశాయి. కానీ ఈ ప్రయోగ శీలత ఎక్కువకాలం సాగలేదు. ఈనాడు పాశ్చాత్య దేశాల రచయితలు కూడా "ప్లాట్" అవసరాన్ని మళ్ళీ గుర్తించారు.

వాతావరణం (setting) కథలోని తరువాత అంగం. దీన్ని కథాస్థలమని, పాత్రలు జీవించే ప్రాంతమని గూడా కొందరు నిర్వచిస్తారు. కానీ వాతావరణం

భౌగోళికం మాత్రమే కాదు. అందులో చరిత్ర, సమాజ నిర్మాణం, సామాజిక సంబంధాలు, కథాకాలం నాటికి ప్రచలితంగా ఉన్నభావాలు, వాటిపూర్వాపరాలు మొదలైన అంశాలన్నీ వాతావరణంలో భాగాలే. అంటే వాతావరణం సామాజికం, బౌద్ధికం (intellectual) గూడా. వాతావరణానికి, పాత్రలకు విడదీయరాని సంబంధం ఉంటుంది. పాత్రలు వాతావరణం నుంచే పుడతాయి. వాతావరణంతో సంబంధం లేని పాత్రలకు దేశకాలాలుండవు. అలాగే వాతావరణం ప్రభావం కథావస్తువు మీద కూడా అధికంగా ఉంటుంది. ఒక వాతావరణంలో ఉన్న కథా వస్తువును, పాత్రలను అందుకు భిన్నమైన వాతావరణంలో ఉంచితే ఎదగవు. చిత్రకళలో నేపథ్యానికున్న ప్రాధాన్యత కథలో వాతావరణాని కుంటుంది. కథా వస్తువును అర్థం చేసుకోవటానికి అవసరమైన సమాచారాన్ని యిచ్చి, అనుభవించటానికవసరమైన 'మూడ్' ను సృష్టించటం సాధారణంగా వాతావరణం కర్తవ్యం. కానీ వాతావరణ చిత్రణే కథావస్తువైన కథలు కొన్ని లేకపోలేదు. వాతావరణాన్ని చిత్రించటంలో రచయితకు నిజాయితీతోబాటు, తాను చిత్రిస్తున్న వాతావరణానికి సంబంధించిన సరైన పరిజ్ఞానం (authenticity) తప్పకుండా ఉండాలి. ఇవి రెండూ లోపించినప్పుడు కథలు నేల విడిచి సాము చేయటం ప్రారంభించి, అభూత కల్పనలుగా మారిపోతాయి.

కథారూపంలోని నాలుగవ అంగం దృష్టికోణం (point of view). కథావస్తువును చూడటానికి కథను చెప్పటానికి మూడు ముఖ్యమైన దృష్టి కోణాలున్నాయి. మొదటిది ఉత్తమ పురుష దృష్టికోణం (First Person Point of View). ఇందులో కథకుడు (narrator) కథలో ఒక పాత్రగా ఉంటూ కథ చెబుతాడు. ఈ పద్ధతిని అనుసరించటంలో రచయితకు కొన్ని ఇబ్బందులున్నాయి. కథ చెబుతున్న వ్యక్తి ("నేను") తాను స్వయంగా చూచిన సంఘటనల్ని, యితరుల ద్వారా తాను విన్న విషయాలను మాత్రమే చెప్పటానికి వీలవుతుంది. కథకుడు పాల్గొనని సంఘటనలకు, యితర పాత్రల మనోగత భావాలకు యీ పద్ధతిలో దాదాపు చోటు లేదు. ఉత్తమ పురుష దృష్టికోణం ఒకే పాత్రకు, అందులోనూ ఆ పాత్ర మానసిక జీవితానికి ప్రాధాన్యత ఉన్న కథావస్తువును తీసుకున్నప్పుడు బాగా సరిపోతుంది. రెండవది ప్రథమ పురుష (Third Person) దృష్టి కోణం. ఈ పద్ధతిలో కథకుడు కథలో పాత్ర కాదు. కథ చెబుతున్న వ్యక్తి ఇతర పాత్రలను ప్రథమ పురుషలో ("అతడు", "ఆమె") సంబోధిస్తాడు. ప్రథమపురుష దృష్టికోణాన్ని సర్వసాక్షి (Omniscient) దృష్టికోణమని, పరిమిత (limited) దృష్టి కోణమని రెండు భాగాలుగా విభజించవచ్చు. సర్వసాక్షి పద్ధతిలో కథకుడు కథలోని అన్ని పాత్రలను, సంఘటనలను, పాత్రల మనోగత భావాలను తెలిపిన "సర్వసాక్షి"లా ప్రవర్తిస్తాడు. కథ జరుగుతూ ఉన్న ప్రతి స్థలంలోనూ తాను ఉన్నట్టుగా, ప్రతి పాత్ర మనసూ తన ఎదుట కనిపిస్తున్నట్టుగా కథ చెబుతాడు. ఈ పద్ధతి అన్ని భాషలలోనూ అత్యధిక ప్రచారంలో ఉంది. పరిమిత దృష్టికోణ పద్ధతిలో కథకుడు ఒక పాత్రను మాత్రమే ఎరిగి ఉంటాడు. అందుచేత ఆ పాత్ర ప్రవర్తనను, మనోగత భావాలను మాత్రమే వివరిస్తుంటాడు ఈ పద్ధతి కూడా ఒకే పాత్రకు ప్రాధాన్యత ఉన్న కథలకు నప్పుతుంది.

దృష్టి కోణాన్ని ఎన్నుకోవటం రచనా క్రమంలో యాంత్రికంగా జరిగే వ్యవహారం కాదు. రచయిత ఆలోచించి తేల్చుకోవలసిన విషయం. కథావస్తువుకు రచయితకు ఉన్న సాన్నిహిత్యం, కథలో ఉన్న నాటకీయత ప్రధానంగా దృష్టికోణాన్ని నిర్ణయిస్తాయి.

కథకుని కంఠస్వరం (tone) కథారూపంలోని తరువాత అంగం. ఇది ఒక వైపున రచయితకు, పాఠకునికి ఉన్న సంబంధం తెలియజేస్తుంది. రచయిత రాజకీయ, నైతిక, తాత్త్విక విశ్వాసాలు రచ

యిత ఉద్దేశ్యాన్ని నిర్ణయించటంలో ముఖ్య పాత్రను నిర్ణయిస్తాయి. పాఠకుణ్ణి తన అభిప్రాయాలకు అను కూలంగా మార్చుకోవటానికి రచయిత ఉపయోగించే ముఖ్య సాధనాలలో కంఠస్వరం ఒకటి. అందులో కోపం, తాపం, దయ, దుఃఖం, వ్యంగ్యం, హాస్యం మొదలైన ఎన్నో భావాలు పలకవచ్చు. లేదా రచ యితకు, కథావస్తువుకు ఉన్న దూరం (distance) ఎక్కువ కావటం వల్ల, రచయితకు కథావస్తువును గురించి స్పష్టమైన అభిప్రాయం లేకపోవటంవల్ల యింకా అనేక కారణాలవల్ల రచయిత కంఠస్వరంలో ఎటువంటి భావమూ పలకకనే పోవచ్చు.

ఒక వ్యక్తి మాట్లాడేటప్పుడు అతడు చెప్పే విష యాన్ని గురించి అతనికున్న అభిప్రాయాన్ని అతని కంఠ స్వరంలో గుర్తించవచ్చు. కానీ కథకుని ఉద్దే శ్యాన్ని రచనలో గుర్తించటం కష్టమే. దీనికి పాఠ కుని కున్న ఒకే ఒక సాధనం కథకుడు వాడుతున్న భాష. భాష తెలిసిన వ్యక్తి వాడుతున్నప్పుడు ప్రతి పదానికి రంగు, రుచి, వాసన ఉంటాయి. వాటిని అర్థం చేసుకోవటమే కథకుని కంఠ స్వరాన్ని గుర్తిం చటం. శైలిలో ఆడంబరత్వం, కృత్రిమత్వం, వాచా లత మొదలైన లక్షణాలున్నప్పుడు కథకుని మన స్సును గుర్తించటం మరింత కష్టమైపోతుంది. అందు చేతనే వ్యావహారిక వాక్య నిర్మాణ పద్ధతికి సాధ్యమై నంత దగ్గరలో ఉన్న సహజమైన శైలిని మాత్రమే కథారచనలో ఉపయోగించవలసి ఉంటుంది. శైలిని ఆధారం చేసుకొని, కథకుని కంఠ స్వరాన్ని గుర్తించి కథావస్తువు పట్ల కథకుని ఉద్దేశాన్ని— తద్వారా రచయిత ఉద్దేశాన్ని— గ్రహిస్తాడు పాఠకుడు. ఒక్కొక్కసారి తనకు తెలుయకుండానే కథకుని వెంట, అతని కంఠస్వరాన్ని నమ్మి వెళ్ళిపోతాడు. కథావస్తువుకు తగిన కథకుడు, కంఠ స్వరమూ కుదిరిన గొప్ప కథల విషయంలో మాత్రమే ఇది జరుగు తుంది.

కథారూపంలోని చివరి అంగం కథన పద్ధతి. సాధారణంగా కథలో ఒకే కథాసూత్రం ఉంటుంది కాబట్టి, లక్ష్యాన్ని గుర్తించిన రచయిత కథనాన్ని సూటిగా నడుపుతాడు. నిరాడంబరంగా లేని కథనం పాఠకుని మనస్సును తాకలేదు. మాటిమాటికీ దృష్టి కోణాన్ని మార్చటం, సంఘటనలలోని కాలక్రమాన్ని తారుమారు చేయటం మొదలైన కథన పద్ధతులు విసుగును కలిగిస్తాయి. నాటకీయత ఉన్న కథనం పాఠకుణ్ణి త్వరగా ఆకట్టుకుంటుంది. అందుచేత రచ యిత వీలైనంత వరకూ నేపథ్యంలోనే ఉండటం మంచిది. కథనానికి అడ్డు తగిలి పాత్రల గుణ శీలాల గురించి, పాత్రల మనోగత భావాలను గురించి వ్యాఖ్యలు చేయటం అంత మంచి కథన పద్ధతి కాదు. పాత్రల మనోగత భావాలను సాధ్యమైనంత వరకూ సంభాషణల రూపంలో వెలికి తీసుకురావటం మంచిది.

ఈ సందర్భంలో ఒక ముఖ్యమైన విషయాన్ని గుర్తు చేసుకోక తప్పదు. కథా సాహిత్యంలో ప్రధాన మైన కథన పద్ధతి వాస్తవికతే! కానీ అది ఏకైక పద్ధతి కాదు. ఒక వస్తువును మరో వస్తువుతో పోల్చ టం, ఒక వస్తువును మరో వస్తువు మీద ఆరోపించ టం, వాస్తవికతను ఆధారంగా చేసుకుని ఊహాగానం చేయటం మానవునికి సహజమే. అందుచేత సంకేత వాదం, ఫాంటసీ, చైతన్య స్రవంతి మొదలైనవాటిని కథన శిల్పంలో భాగాలుగానే పరిగణించాలి. వీటిని అనభ్యుదయ ధోరణులుగా నిరసించటంలో అర్థం

లేదు. విశ్వసాహిత్యంలోని అభ్యుదయ కాముక రచయితలందరూ ఈ మార్గాలను అనుసరించిన వారే.

ఇంతవరకూ చర్చించిన కథాంగాలేవీ స్వతంత్ర మైనవి కావు. ఇతర అంగాలతో పొత్తు లేనప్పుడు ఏ ఒక్క అంగానికీ స్వతంత్ర ప్రతిపత్తి లేదు. కథ గొప్పతనం వీటి అల్లిక మీద ఆధారపడి ఉంటుంది. ఈ ఐదు అంశాలూ ఒకదానితో మరొకటి కుదిరి, ఒక దాన్ని మరొకటి మింగివేయకుండా సహజంగా ఒక design లాగా రూపొందాలి. దీనికి రచయిత ఆదర్శము, కథన పద్ధతి తోడు కావాలి. వీటన్నిటి సమాహార రూపమే మంచి కథ.

ఆధునిక సాహిత్య విమర్శల్లో విశ్లేషణ (analisis) ప్రధానమైన పద్ధతి. ప్రతి వస్తువును, విషయాన్ని అంగాలుగా విభజించి, పరిశీలించి, ఆ తరువాత అందులోని అంగాంగ సమ్మేళనాన్ని (organic unity) చూచి ఆనందించటం ఆధునిక శాస్త్రీయ దృష్టి. శాస్త్రానికున్న లక్షణాలు అలవరచుకోవాలని తపించి పోతున్న సాహిత్య విమర్శలో కూడా ఈ గుణం ప్రముఖంగా కనిపిస్తుంది. ఈ వ్యాసంలో చర్చించబడ్డ ఏ అంగమూ కథ కాదు. అంతేకాక అన్ని అంగాలూ ఉన్నంత మాత్రం చేతనే గొప్ప కథ రూపొందదు. అన్ని కథల్లోనూ అన్ని అంగాలూ సమానమైన ప్రాధాన్యతను కలిగి ఉండవు. కథాంగాల విశ్లేషణే కథా విమర్శ అన్న యాంత్రిక దృష్టికి లోను కాకుండా, అంగాంగాల కలయిక లోని అంశమే కథలోని గొప్పతనం అని గుర్తించటం చాలా అవసరం. సుప్రసిద్ధ నవలాకారుడు, కథా రచయిత Henry James అన్నట్టు—

"A story is a living thing, all one and continuous like any other organism, and in proportion as it lives will it be found, I think, that in each of the parts there is something of the other parts."

ఇంగ్లీషు లెక్చరర్
బిసెంట్ థియోసిఫికల్ కాలేజి
మదనపల్లి -517327

## హిందీ ప్రచారకులకు - విద్యార్థులకు మనవి

ది. 27-2-1983 ఆదివారం నాడు జరుగు ప్రాథమిక, మధ్యమ, రాష్ట్రభాష పరీక్షలను ఆయా కేంద్రాలలో జరుపుటకు ఏర్పాట్లు జరుగుతున్నవి. గమనింప ప్రార్థన.

కార్యదర్శి





# ర్థంలో స్వార్థం

—ఎమ్. పార్వతీశం

"బిరబిరా కృష్ణమ్మ పరుగులిడుతోంది" - బంగారు పంటలు పండించడానికి ... !

అశేష జనసమూహం కృష్ణవేణిని సేవించడానికి తరలివస్తున్నారు తెలుగు నేల నాలుగు చెరగులనుండి.

పుష్కరాల సంబరంలో హర్షపులకితగాత్ర అయిన కృష్ణవేణి పుణ్యస్నానాలు ఆచరించే భక్తులను పునీతం చేస్తోంది.

కృష్ణాతీరంలో పురోహితుల మంత్రపఠనాలు కృష్ణవేణీ తరంగాల మృదంగ నాదాలతో శృతులు కలుపుతున్నాయి!

వందలాదిగా పురోహితులు; వేలాదిగా భద్రతా సిబ్బంది. లక్షలాదిగా జనసమూహం!!

ఎటు చూసినా విజయవాడ పట్టణం ఓ వింత శోభను సంతరించుకొంటున్నట్లుంది ...

స్నానఘట్టాలకు సమీపంలో యాత్రికులకు స్వాగతం చెప్పడానికా అన్నట్లు పురోహిత బృందాలు ఎదురుచూస్తున్నాయ్!

ఎవరైనా సంకల్పం చెప్పించుకోడానికో, పిండ ప్రదాన కార్యక్రమం జరిపించుకోడానికో వస్తారని; వచ్చినవారికి కావలసిన కార్యక్రమం జరిపించి, తద్వారా పదిరూపాయిలు సంతరించుకోవచ్చునని ఆశ ....

అప్పుడే బస్సు దిగి సరాసరి ఘాట్‌కు వచ్చిన దంపతులకు విజయవాడ పరిసరాలు క్రొత్తకావటంతో అటూ ఇటూ పరికించి చూస్తున్నారు.

ఇంతలో ఓ పురోహిత బృందం హుటాహుటిగా ఆ దంపతుల దగ్గరకొచ్చి వాళ్ళని యక్షప్రశ్నలతో ముంచెత్తటం ప్రారంభించారు -

ఏ రకం క్రతువు కావాలంటే ఆ రకం క్రతువు చేయిస్తామని నేను చేయిస్తానంటే నేను చేయిస్తానని తొందర చేయసాగారు.

ఎవరి గొడవ వాళ్ళదేగాని ఆ క్రొత్త మనుషుల్ని గుక్కతిప్పుకోనివ్వటం లేదు!

"నేను ముందుగా చూసిన పాసింజర్లని నువ్వొచ్చి బేరమాడతావేంటోయ్ మహా యిది గానూ..." అంటూ బుకాయించాడొక నడివయస్సు పురోహితుడు మరో కుర్ర పురోహితుణ్ణి -

"ఏం ? నువ్వేమైనా మిరాశీ పుచ్చుకున్నావా ? మిరాశీ గిరాశీ వుంటే మీ ఊరి పొలిమేరల్లోనేనోయ్; ఇదేంటనుకొన్నావ్ ? బెజవాడనుకో...." గదమాయించాడు కుర్ర పురోహితుడు -

"నీ వాలకం చూస్తుంటే బడా రుస్తుంలాగున్నావ్; ఏమిటోయ్ నీ గదమాయింపు! యిందాకట్నుంచి చూస్తున్నాను" అంటూ రెండడుగులు ముందుకేశాడు మధ్యవయస్కుడు -

"ఆఁ.... ఆఁ.... మీద మీదకొస్తున్నావే ఎవడను కొన్నావ్.... " అంటూ చేతిలో వున్న పంచాంగం ప్రక్కనున్న వాడికిచ్చి బూతుల పంచాంగం ప్రారంభించి; అమాంతంగా ఆ నడివయస్కుడి మీదికి లంఘించటంతో ఇద్దరూ మల్లయుద్ధానికి తలపడ్డారు..!

చుట్టూ జనసమూహం చేరి వినోదం చూడ సాగారు!

ఓ వృద్ధ పురోహితుడు ఆయాసపడుతూ అక్కడికి చేరుకొని, "ఏమిటయ్యా పోలీసువారూ .... అట్టా విగ్రహాల్లా చూస్తూ నుంచుంటారు... అరాచకం జరిగిపోతుంటేను... రామ రామ... ఎంత ఘోరం.. ఎంత దారుణం!! అ.... అ.... చూస్తూ ఊరుకొంటారేవిఁ షంట....!! అంటూ వాపోతున్నాడు నెత్తి నోరు మొత్తుకుంటూ -

ఇంతలో ఓ యువ పురోహితుడు అక్కడికొచ్చి, ఒడుపుగా ఇద్దర్నీ విడదీసి చెరోవైపుకీ విసిరినంతపని చేసి కసిరికొట్టాడు!

అప్పటికే భుజబలం సన్నగిల్లిన "బాపలిద్దరూ" బింకంగా మాట్లాడుతూ చెరోవైపుకీ సర్దుకొన్నారు -

"ఛి...ఛీ...కక్కుర్తి వెధవలు... ఒక హుందాతనం లేదు. వృత్తిగౌరవం లేదు;" అంటూ అసహ్యించుకొన్నాడు ఆ యువపురోహితుడు.

"ఎవరూ...! రామం... అ వ ధా న్లు గా ర బ్బాయా...??" అంటూ ఆ వృద్ధపురోహితుడు రామశాస్త్రి దగ్గరకొచ్చి ఆప్యాయంగా రెండు చేతులు పట్టుకొని; "ఈ అవతారం ఏవిఁట్రా యనా? నీకెందుకొచ్చిందీ అవస్థ... అఁ సలక్షణంగా 'ఎమ్మెస్సీ' చదువుకొన్నావు, రేపోమాపో పెద్ద ఉద్యోగం చెయ్యవలసినవాడివి.... ఈ ఖర్మ నీకెందుకురా తండ్రీ..." అంటూ ఆయన ఆదేపనిగా వాపోయాడు—

సనాతనసంస్కృతి, సాంప్రదాయం, వేషభాషలు అంటే అభిమానించే ఆ వృద్ధపురోహితుడు వేంకటశాస్త్రిగారికి అదే సాంప్రదాయిక వేషంలో తయారైన రామశాస్త్రిని చూస్తే పట్టరాని దుఃఖం, ఆవేదన కలుగుతున్నయ్...! కారణం ఆయనకే తెలుసు...!!

మూడు తరాలకు వారధి అయి.... గతానికి, వర్తమానానికి సాక్షీభూతుడయిన తనను ఈనాటిదేశకాల పరిస్థితులు బంగాళాఖాతంలో ఏర్పడే తుఫానుల్లా కలచివేస్తుంటాయి—

ఇంతలో మరో టూరిస్టు వచ్చి ఆగటంతో స్నానాలకోసం ఎవరైనా వస్తారేమోనని ఆతృతగా తన స్థూలకాయాన్ని టూరిస్టు బస్సువైపుగా దొర్లించుకొంటూ వెళ్ళినంత పనిచేశాడు పాపం వేంకటశాస్త్రి...

స్నానాలకోసం వచ్చే యాత్రికులతో మర్యాదగా మాట్లాడడం, నేర్పుగాను ఒడుపుగాను వాళ్ళదగ్గర నుండి దానాలు, దక్షిణపట్టణం సులభంగా అలవడ్డాయి రామశాస్త్రికి—

అరగంటలో ఆరుగురిచేత స్నానంచేయించి, సంకల్పంచెప్పి ఇరవై రూపాయలు సంపాదించేశాడు...!

"వెధవది... ఏ ఉద్యోగంచేస్తే మాత్రం అరగంటలో ఇరవై రూపాయలు సంపాయించగలం!" అనుకొంటూ యాత్రికులు దక్షిణతోపాటు యిచ్చిన తమలపాకులు కృష్ణలోపారేసి; రూపాయినోట్లు చిల్లరమాత్రం భద్రంగా బొడ్డుకో దోపుతున్నాడు—

యూనివర్సిటీని వదిలేవరకూ రామశాస్త్రికి బెల్ బాటమ్స్ వేయటమే గాని; పంచ కట్టడమే చేతకాదు! ఇప్పుడైతే మొలచుట్టూ చిల్లర డబ్బులు, ఖర్జూరకాయలు. వక్కలు (ఈ మధ్య పొడుంకాయ కూడా) అవలీలగా దాచిపెట్టగలడు .... అదీ ఒక విద్యే అనుకొనేవాడు మొదట్లో-

వట్టిరోజుల్లోనైతే రోజంతా తంటాలుపడి టౌనంతా తిరిగి తిరిగి వ్రతాలు, పూజలు చేయించినా సిటీబస్ ఛార్జీలుపోను పదిరూపాయలు కూడా గిట్టేవికావు.

వతనుగా కుదుర్చుకొన్న శుక్రవారం పూజలు, దస్రాల పూజలు తన సంపాదనలో "బోనస్"గా భావించేవాడు రామశాస్త్రి.

పుష్కరాల పుణ్యమా అని రోజూ రెండువందల వరకూసంపాదించగలుగుతున్నాడు....!! సంపాదనలో రామశాస్త్రికి కుదిరిన పట్టు మరే పురోహితుడికీ కుద

రటంలేదు...సంకల్పచెబితే ఐదు, హిరణ్యం పెట్టిస్తే పాతిక, అన్నశ్రార్ధం పెట్టిస్తే అర్థనూట పదహార్లు అవలీలగా గుంజేస్తున్నాడు-

"ఏటా పుష్కరాలొస్తే ఎంత బాగుండునో కదా....!" అనుకొన్నాడు రామశాస్త్రి-

ఉద్యోగం రాక ఎంప్లాయిమెంట్ఆఫీసుచుట్టూతిరిగి తిరిగి చెప్పులు అరిగిపోవడం తప్పితే పైసా ఆదాయం లేదు... పాతికేళ్ళ వయస్సు దాటి కూడా పరాన్న భుక్కులా బ్రతకడం ఇష్టంలేని యువకుడు రామ శాస్త్రి-

అందుచేత; ఇదికాదు పని అనుకొని "కులవృత్తికి సాటిలేదు గువ్వలచెన్నా ...." అని చిన్నప్పుడు చదువు కొన్న పద్యం గుర్తుకుతెచ్చుకుని ఏణ్ణర్థంక్రితమే పౌరో హిత్యం వృత్తిగా చేపట్టాడు రామశాస్త్రి; తండ్రికి ఇష్టంలేకపోయినా—

అప్పట్నుంచి తన ఖర్చులుపోను కొద్దోగొప్పో తల్లికికూడా ఇస్తున్నాడీమధ్య ఇంటిఖర్చుల నిమిత్తం.

అవధాన్లుగారు మాత్రం కొడుకుసంపాదన పైసా ముట్టుకోడు...! కొడుకు ఆఫీసరౌతాడని, ఆఫీసరుగా సంపాయించిన మొదటిజీతం తాను చూసి ఆనందించా లని తనకి తనకొడుక్కీ కూడా అదే ప్రయోజకత్వ మని నిర్ణయించుకొన్నాడు.

రామశాస్త్రికి మాత్రం అలాంటి ఆశలు, కోరికలు లేకపోలేదు... ఒకప్పుడుండేవి...

తాను కాలేజీలో చదువుకొనే రోజుల్లో భవిష్యత్తును గురించి బంగారు కలలు కంటూండేవాడు-

తాను పి.హెచ్.డి., చేసి ప్రముఖ శాస్త్రవేత్త అయి సి.వి. రామన్ అంతటి పేరు, ప్రఖ్యాతి సంపా దించాలని కలలు కంటూండేవాడు... అంతే కాదు... తన పేరు చివర నున్న "శాస్త్రి"ని తీసివేసి ఎంచక్కా "రామన్" అని మార్చుకుందామనుకున్నాడు కూడాను...!!

అందుచేతనే యూనివర్శిటీలో చేరి చాలా కష్టపడి చదివి 'ఎమ్మెస్సీ' చేశాడు.

అంతలోనే అవధాన్లుగారి ఆర్థిక భాండం కాస్తా అడుగంటింది; ఆడపిల్లల పెళ్ళిళ్ళతోను; అబ్బాయి చదువులతోనూ-

అంతే- తండ్రీ కొడుకుల ఆశయాలు, ఆశలుగానే మిగిలిపోయాయి. దానికితోడు ఏ ఉద్యోగమూ రాక పోవటంతో పాపం వాళ్ళ కలలన్నీ కల్లలయ్యాయి..!

"అయ్యా! శాస్త్రులుగారూ; హిరణ్యం పెట్టి చ డానికి ఎం కావాలో చెబుతారూ?" అంటూ ఒకాయన స్కూటర్‌కు స్టాండు వేస్తూనే ప్రశ్నించడంతో- గతం లోంచి వర్తమానంలోకి జర్రున జారి పడ్డట్టయింది రామశాస్త్రికి...!

ఆ వచ్చిన వ్యక్తికి కావలసిన వస్తువులు చెప్పి, చీటీ వ్రాయించి; తొందరగా రమ్మని పురమాయిం చాడు.

ఆ స్కూటర్ ఆసామిని ఒకటి రెండు సార్లు ఏవో మీటింగ్స్‌లో చూశాడు తను ఆతను వేదిక మీద మైకు మీద నిలబడి మూఢ నమ్మకాలను సనాతన మైన ఆచారాలను దుయ్యబడుతుండేవాడు...!!

ఇప్పుడిక్కడికొచ్చాడేమిటి చెప్మా...!! అనుకొని ఆశ్చర్యపోయాడు రామశాస్త్రి-

ఐనా ఒకప్పుడు తాను మాత్రం అలాంటి కబుర్లు చాలా చెప్పాడు... కాలేజీ వార్షికోత్సవాలలో భౌతిక వాదాన్ని సమర్థిస్తూ, మూఢ నమ్మకాలను విమర్శిస్తూ గంటల తరబడి మాట్లాడేవాడు...!!

ఏం చేస్తాం పొట్టకోసం పుట్టెడు అవస్థలు" అను కొని సరిపెట్టుకొన్నాడు-

అప్పట్లో తనకి పురాణాలన్నీ పుక్కిటి పురాణా లుగా అనిపించేవి... ఇప్పుడయితే అవసరం కొద్దీ తనే చెబుతున్నాడు పుష్కరాల గాథలు, కార్తీక పురాణాలూనూ- నా అవసరం నాది; ఆయన కక్కుర్తి ఆయనది- అనుకొని,

స్పాటక్ ఆసామికి కావలసిన కార్యక్రమం లౌక్యంగాను, లఘువుగాను జరిపించేసి దశదానాల నిమిత్తం రెండు దశకాల నోటు, దక్షిణల నిమిత్తం ఓ దశకం నోటు; ఏతా వాతా ఓ ముప్ఫయి రూపాయలు ముట్టేటట్లు చూచుకొని ముచ్చటగా పంపేశాడు.

మిట్టమధ్యాహ్నం... నెత్తి, నేల మాడుతోంది.... ఎక్కడా దగ్గర్లో నీడయినా లేదు... ఐనా; "నీడ కోసం చూచుకొంటే కూడెలా వస్తుంది?" అని సరి పెట్టుకుని మాడసాగాడు-

అప్పటికి స్నానఘట్టం దగ్గరున్న 'స్కోరు బోర్డు' ఇరవై వేల మంది స్నానాలు చేసినట్టు చూపిస్తోంది!! పుణ్య తీర్థంలో స్నానాలు చేసి తరించాలనే ఆరాటం కొద్దీ జనసమూహం చీమల బారుల్లా తరలి వస్తోంది స్నాన ఘట్టాల వైపునకు-

కొంతసేపటికి తనవైపే వస్తున్న జీపును చూసి రామశాస్త్రి తన అదృష్టం పండిందనుకొన్నాడు; పెద్ద పద్దు లభించబోతోందని...!!

జీపు దగ్గరకొస్తున్న కొద్దీ దాని మీద వ్రాసి వున్న అక్షరాలు, సులభంగా గుర్తుండే నంబరు ప్లేటు స్పష్టంగా కనుపించాయి- ఔను; "ఈ జీపుని ఎక్కడో చూసిన గుర్తు" అనుకొన్నాడు రామశాస్త్రి-

జీపులోంచి ఆరడజను మందికి పైగా ఆడా మగా బిలబిలా దిగారు

వెనకాల ట్రయిలర్ లోంచి సామాను ఒకటొకటే దింపుతున్నాడు జవాను-

జీపు దిగిన ఆఫీసరు నేరుగా రామశాస్త్రి దగ్గరకే వచ్చాడు. రామశాస్త్రి మర్యాద సూచకంగా కొంచెం ముందుకు వంగి మరీ నమస్కారం చేశాడు-

ఆఫీసరుగార్ని కూడా స్పష్టంగా గుర్తుపట్టాడు.... ఆరు నెల్ల క్రితం ఈయనే తనను ఇంటర్వ్యూ చేసింది- ఆనాడు తను అన్ని ప్రశ్నలకీ సమాధానం చెప్పాడు, ఆ సమాధానాలకి ఆఫీసరు కూడా సంతృప్తి పడ్డట్టు చిరునవ్వుకూడా నవ్వటం, "మంచిది బాబూ వెళ్ళిరా" అనటం తనకింకా గుర్తుంది-

కానీ; ఆ ఉద్యోగం తనకెందుకు రాలేదో ఆ తర్వాత తెలిసింది- అవి రిజర్వుడు వేకెన్సీలని... మరి కొన్ని వేకెన్సీలు వస్తే "ఓపెన్ కాంపిటీషన్"లో యిస్తారనీ!!

ఈసారైతే మాత్రం అంగబలం, అర్థబలం లేని తనలాంటివాడు 'పరుగు పందెం'లో ఎలా నెగ్గగలడు!

ఆ సంవత్సరంలో హాజరైన ఆరడజను ఇంటర్వ్యూల్లోనూ అదీ ఒకటి అనుకొని నిర్లిప్తంగా ఆ సంగతే వదిలేశాడు రామశాస్త్రి-

"ఇదిగో పంతులుగారూ! మా పని కాస్త తొందరగా జరిపించాలయ్యా" అంటూ ఆఫీసరుగారి నోటి వెంట మాట రావటమే ఆలశ్యం;

''తమరిక్కావలసిన క్రతువు సలక్షణంగా చేయిస్తాను సార్; సెలవిప్పించండి; హిరణ్యం పెట్టిస్తారా, యింకా ఘనంగా జరిపిస్తారా'' అంటూ మొదలు పెట్టాడురామశాస్త్రి.

"చూస్తున్నావ్ కదయ్యా హంగు, ఆర్భాటం! పన్నెండేళ్ళ కొకసారి- ఈ కానిమ్ సలక్షణంగానే చేద్దాం; అంటూ పిండప్రదానం చేయవలసిన పితృదేవతల జాబితాను అందించి కార్యక్రమం పురమాయించాడు ఆఫీసరుగారు-

''ఆపీసరు తల్చుకుంటే అరేంజిమెంటుకు కొదవేముంది" అన్నట్లు, షామియానా వేయించటం, వంటా వార్పు, మంత్రం తంత్రం అంతా సలక్షణంగా కార్యక్రమం జరిగిపోతోంది-

రామశాస్త్రి మంత్రం చెబుతున్నంతసేపూ శాస్త్రిని ఓ కంట పరీక్షగా చూస్తున్నాడు ఆఫీసరుగారు... అతణ్ణి ఎక్కడో చూసినట్టు, ఆ మాటలు ఎక్కడో విన్నట్టు గుర్తుకు తెచ్చుకోవడానికి ప్రయత్నిస్తున్నాడు మధ్య మధ్య-

"ఔను- ఒకసారి ఇంటర్వ్యూలో ఎవరూ చెప్ప లేని ఒక జనరల్ క్వశ్చన్‌కు చక్కగా జవాబు చెప్పి మెప్పించిన కుర్రాడే ఇతను"- అనుకొన్నాడు.

రామశాస్త్రి గుణగణాలు, మంచి మర్యాదలు, చక్కని సంస్కారం; అన్నిటినీ మించి అతని పట్టు దల, ఆత్మవిశ్వాసం ఆఫీసరుగార్ని ఆకట్టుకో సాగినై !

పేరు, ఊరుతో మొదలుపెట్టి, చదువు సంధ్యలు తండ్రి తాతల వరకూ కావలసిన సమాచారమంతా మాటల మధ్యలో ఒక్కొక్క విషయం తెలుసుకో గలిగాడు ఆఫీసరుగారు-

ఆఫీసరు గారు అడిగిందానికల్లా సమాధానం చెప్పి ఆనాటి కార్యక్రమానికిగాను ఆఫీసరుగారి దగ్గరనుండి అవలీలగా అరవై రూపాయల వరకు రాబట్టగలిగాడు రామశాస్త్రి !

* * *

పుష్కరాలు పూర్తయినాయి.

విజయవాడ పట్టణం విశ్రాంతిగా ఊపిరి పీల్చుకో సాగింది...!!

బిరబిరా కృష్ణమ్మ పరుగు లిడుతూనే వుంది- బంగారు పంటలు పండించడానికి-

మూడోనాటి టపాలో అవధాన్లుగారింటికి రెండు కవర్లొచ్చాయి.

ఒకటి రామశాస్త్రికి; రెండోది అవధాన్లుగారికి....

రామశాస్త్రి కవర్లో అపాయింటుమెంటు ఆర్డరు. ..

అవధాని గారి కవర్లో "అబ్బాయిని" తీసుకొని పెళ్ళి చూపులకు రావలసిందిగా ఆహ్వానం...!!

వారం తిరిగేసరికల్లా; పెళ్ళి చూపులు, లగ్న పత్రికలు, అన్నీ జరిగిపోయాయి-

"ఆఫీసరు గారింట్లో పెళ్ళికి అందరూ పెద్దలే" నన్నట్లు ఆఫీసు సిబ్బంది అంతా కమ్ముకొని ఆరేంజి మెంట్లన్నీ పూర్తి చేశారు.

ఆనాడు అవధాన్లుగారి ఆనందానికి అవధుల్లేవు..!!

తెలుగు పండిట్,
జిల్లాపరిషత్ హైస్కూల్,
తేలప్రోలు-521 109
కృష్ణాజిల్లా.



సమీక్షా వ్యాసం

# ఆధునిక తెలుగు సాహిత్య విమర్శ : సాంప్రదాయికత

—డా॥ హెచ్. ఎస్. బ్రహ్మానంద

(ద్వితీయ భాగం)

డా॥ సంపత్కుమారగారి గ్రంథాన్ని సమీక్షించడం పూర్వ వ్యాసంలోనే డిసెంబరు-82 దాదాపు పూర్తి అయినాఇంకా కొన్ని అంశాల్ని 'సంప్రదాయాన్ని' గురించి ఆలోచించేవారు పట్టించుకోవాల్సినట్టుగా అనిపించి ఈ రెండో భాగం రాయబడుతోంది.

సంప్రదాయాన్ని గురించి మాట్లాడే ప్రతిఒక్కడూ సమాజానికి ద్రోహం చేస్తున్నట్టేనా! అన్న ప్రశ్న ఒకటి మిగిలిపోతోంది. అసలీ ప్రశ్న ఏమిటన్న మిమాంస రావచ్చు. తత్త్వం, మతం, సంప్రదాయం, ఆచారం, ధర్మం లాంటి మాటలకు ఈనాడు 'Currency' (వ్యాప్తి) పోతూండటం అటుంచి, అసలా మాటల కన్నిటికీ న్యూనార్థ భావన '(Pejoratime Thinking)' ఒకటి వ్యాపిస్తోంది. ఈ భావన దృష్టితో పై ప్రశ్నకు సమాధానం ఆలోచించి చెప్పాలి.

స్పష్టంగా ఒక విషయం ప్రజాభిప్రాయంగా స్థిరపడిపోయింది. అభ్యుదయవాది-అంటే సంప్రదాయ 'నిరాసం' తప్పక చేయాలన్నది. చేతల్లో కాక పోయినా మాటల్లోనైనా చెయ్యాలన్నది. ఇది యువకుల ధర్మంగా భావించబడుతోంది కూడా. ఇక సంప్రదాయకుల విషయం—(సాంప్రదాయకులనడం ఇంకా బాగుంటుంది)—ఆధునికత వెర్రివేలమని-గమ్యంలేని ప్రయాణమని, అందుచేత వీలయినంత దాకా ఆధునికతకు వ్యతిరేక ప్రమాణాల్ని చూపించ గల్గినవాడే - సంప్రదాయాభిజ్ఞుడని - వీరి అభిప్రాయం. ప్రాయకంగా వీళ్ళు వయసు చెల్లిన వాళ్ళు.

పైన చెప్పిన 'యువకుడు', 'వయసు చెల్లిన వాడు' అన్న మాటలు కేవలం వయసుకి సంబంధించినవి అనుకోవడం పొరపాటే. ముసలివాళ్ళలో యువకులూ వున్నారు. యువకుల్లో ముసలివాళ్ళు ఉన్నారు. ఈ గమ్మత్తునీ గుర్తించాలి 'సంప్రదాయానుస్యూతి'ని గురించి ఆలోచించేటప్పుడు.

ఉదాహరణానికి భాషాశాస్త్ర విషయం చూద్దాం. లింగ్విస్టిక్స్ చదువుకున్న వాడంటే సంప్రదాయ వ్యాకరణ గ్రంథాల్లో ఏమీ లేదనీ - అన్నీ ఇంగ్లీషు' పుస్తకాల్లోనే ఉన్నాయన 'అని నమ్మేవాడనీ - ఒక దురభిప్రాయం చాలామందిలో ఒక్కప్పుడు ఉండేది. అప్పటికది యువతరం. ఆతరం వాళ్ళు ఈనాడు పెద్దవాళ్ళయ్యారు. ఈనాడు వాళ్ళని అడిగితే - స్పష్టంగా చెప్పగలుగుతున్నారు - సంప్రదాయ వ్యాకరణాల్లో చాలా విషయములు ఉన్నాయి - కాని వాటి వెనుక ఉన్న దృక్పథం భిన్నమైంది. శాస్త్రం ఎప్పుడూ 'పాత'తో ఆగిపోదు. 'క్రొత్త' పాతనుంచి స్ఫూర్తిని గ్రహిస్తూ ముందుకు వెళ్ళడాన్నే ధ్యేయంగా కల్గిందని-

ఈ 'ముందుకువెళ్ళడం' అన్నదే ప్రధానవిషయం. ముందుకు వెళ్ళడంలో ఆధునికత + ప్రాచీనత అన్న విభేద పరిగణన ప్రధానం కాదు. ఇంతవరకు వచ్చిన - వస్తున్న - అవగాహనలో అభ్యుదయంగా

గుర్తించవగిన అంశం ఏ 19వ శతాబ్దంలోనో ఎవరో చెప్పివున్నాదాన్ని మనం గ్రహించడంలో తప్పులేదు - అది మన 'అవగాహన' పరిధుల్ని పెంచగలిగితే - అందుకే వడలి మందేశ్వరరావుగారు ఒకచోట గుర్తించారు-ఆధునిక యువ రచయితల్లో (మార్క్సిస్టుల్లో ముఖ్యంగా) 'ఆధునికులము' అన్న ముద్ర వేసుకోవాలన్న తాపత్రయం లేదని (చూ. 'సాహిత్యంలో ఆధునికత' భారతి, జూలై (1978 లో).

నిజమే! ఈనాడు మనలో చాలా మంది మావో నుంచీ స్ఫూర్తిని గ్రహిస్తూ (ఇలాంటి ప్రయత్నానికి చూ. ప్రజాస్వామిక సంస్కృతి కందుకూరీ గురజాడల దోహదం), ఎస్.ఎస్.పి. ప్రచురణ. కావలి. 1980). అది పాత కళారూపమైనా కొత్త 'content'ని చెప్పగలుగుతున్నపుడు దాన్ని అభ్యుదయ బోధకంగా గుర్తించడంలో మనకు ప్రతిపత్తి లేదంటున్నాం. అంచేతనే వెల్చేరు నారాయణరావు గారు (1978) కవిత్వంలో ఆధునికత X ప్రాచీనత అనే విభాగ పరిగణన బదులు అభ్యుదయ ప్రబోధకంగా నిరోధకం అనే మరో ప్రమాణాన్ని గుర్తించారు. ఆయన పరిభాషలో చెబితే ఆనంద కవిత్వం అభ్యుదయ నిరోధకం. చైతన్య కవిత్వం ప్రబోధకం. వారు ఆనందమనే మాట ద్వారా భావ కవిత్వ శాఖల్లో దేన్నయినా సూచించి ఉంటే ఎవరికీ అభ్యంతరం లేదు కాని— 'రసాన్ని' సూచించి వుంటే మాత్రం మనం కొంత ఆలోచించాల్సిందే. రసంలో ఆనందం + చైతన్యం— రెండూ కలిసి వుంటాయన్నది ఈనాటి మన అధునాతన అవగాహన. (చూ. కోటేశ్వరరావు 1982)

ఈ నేపథ్యంతో సంప్రదాయం ప్రగతి వ్యతిరేకమా ! అన్న ప్రశ్న వేసుకోక తప్పడం లేదు. (ఇదే పేరుతో ఒక వ్యాసం కూడా 'భారతి'లో వచ్చింది. (చూ. సాంధ్యశ్రీ 'సంప్రదాయం ప్రగతి వ్యతిరేకమా ! భారతి ఫిబ్రవరి 1978.) అంటే సంప్రదాయాన్ని గురించి మాట్లాడే ప్రతి ఒక్కడూ 'భావవాది' మాత్రమేనా ! లేక తన విద్యా వ్యాసంగంతో మసిపూసి మారేడుకాయచేస్తూ 'భావ'వాదాన్నే సమర్థిస్తున్నాడా ! ఇది 'రియాక్షనరీ' ఉద్యమంలో భాగమేనా !

ఈ ప్రశ్నల్ని తిరగవేసి చూసుకుంటే సమాధానం దొరుకుతుందేమో చూడాలి. 'ప్రగతి' వ్యతిరేకం కాకపోతే సంప్రదాయవాదులంతా బూర్జువాలుగా! సంఘ వ్యతిరేక శక్తులుగా (విశ్వనాథ సత్యనారాయణ గారితో కలిపి) ఎందుకు చిత్రించబడాల్సి వచ్చింది ? సమాజంలో సంప్రదాయాన్ని గురించి ఏ కొద్ది మందో మాత్రమే ఎందుకు పీపులు తడుముకుంటున్నారు ? కొంతకాలం 'సాంప్రదాయకులు'గా చలనం లేకుండా ఉండి పోయిన వారు ఉన్నట్టుంది 'మంచి గతమున కొంచెమేనోయ్' అన్న గురజాడలాగానో; 'సంప్రదాయాలకేం బోలెడున్నాయ్, లోపించింది ఆచరణ మాత్రమే' అన్న శ్రీశ్రీలాగానో; దశాల్ని తమని తాము సవరించుకొని అభ్యుదయ—విప్లవ మార్గాలతో ఎందుకు మమైక్యాన్ని పొందిపోయారు ? (ఇటీవల అలా స్పష్టంగా పరిణామం పొందిన కవి—విమర్శకులు, పుట్టపర్తి, కేతవరపు).

ఇవి దేన్ని సూచిస్తున్నాయి ? సంప్రదాయాన్ని గురించి మాట్లాడ్డం— ఒట్టి అర్థరహితమైన మార్గమనీ — అశాస్త్రీయమనీ స్పష్టం చెయ్యడం లేదా ! అని ప్రశ్నించ వచ్చు.

అలాంటప్పుడు సంపత్కుమారగారి ప్రయత్నం మాత్రం ప్రగతి వ్యతిరేకం కాదా !— అసలీ సమీక్ష సంపత్కుమారను సమర్థిస్తోందా ! ఖండిస్తోందా ! సమీక్షకుడు ఏ వర్గానికి చెందినవాడు ?

ఈ సమీక్షకుడు సంపత్కుమారను 'విమర్శించాడు'. సంప్రదాయం ప్రగతి వ్యతిరేకం కాదు. సంప్రదాయ నేపథ్యం లేకుండా ప్రగతి ఎప్పుడూ ఎక్కడా లేదు. ప్రగతి సమాజ గతికి సంబం

ధించింది. సంప్రదాయం ఆ గతితోపాటు రూపాంతరాన్ని పొందుతూ, దానికి వ్యక్తిత్వాన్ని సంతరించి పెట్టేది. సాహిత్యంలో 'ప్రగతి' అన్న 'Rotion' చాలా 'Absurd' — అంటే నిరర్ధకమని అర్థం. అభ్యుదయం సాహిత్యంలో కాదు ఉండేది. సామాజికంగా మనుష్యులు నిర్ధరించుకొని నియమించుకొనే వ్యవస్థలో ఉంటుంది. దానికి మార్పు సహజమైంది. ఆ వ్యవస్థలో మార్పుని ఆభిలషించడం, దానికి సామాజిక వ్యక్తిగా తోడ్పాటు నివ్వడం — అభ్యుదయ పంథాలో పయనించబడమంటే — అంటే సాంప్రదాయకుడు ప్రగతి వ్యతిరేకి ఎప్పుడవుతాడంటే— తన సామాజిక పాత్రను స్వార్థంకోసం (Vested Interest) వినియోగించు కొన్నపుడు. మరి అలాంటివాడి సాహిత్యం మాత్రం ప్రగతికి వ్యతిరేకం కాకుండా ఎలా వుంటుందన్న దొక్కటే మన తెలుగు విమర్శకుల్ని నిత్యం వేధిస్తున్న అంశం.

సంపత్కుమార గ్రంథంలో స్పష్టంగా కానవచ్చే అంశం ఈ విషయమే. సామాజిక బాధ్యత వరకి ఆలోచిస్తే సంపత్కుమార మార్క్సిస్టు వ్యతిరేకికాడు. ఈ సమీక్షకుడూకాడు. సాహిత్య వివేచన విషయంలో సంపత్కుమారలోని సాహిత్య 'వ్యక్తి' మేల్కొంటున్నాడు. ఆ వ్యక్తి బూర్జువా సమాజంలోనూ ఒకడే. సమసమాజంలోనూ ఒకడే. వాడి సంప్రదాయానుస్యూతిని' గురించి సంపత్కుమార వివేచించడానికి ప్రయత్నించింది. ఆ అంశాన్నే ప్రగతి వ్యతిరేకం కాదని ఈ సమీక్షకుడూ అంటున్నది. ఈ విషయంలో 'ప్రగతి' అన్న భావమే లేదనీ అంటున్నది.

ఒక ఉదాహరణం చూద్దాం. రాజకీయ నాయకుడున్నాడు. వాడికి సిద్ధాంతాలు తెలిసినా తెలియక పోయినా వాడు పనిలో తన పనితనం చూపెడతాడు. శాస్త్రజ్ఞుడున్నాడు. వాడు పుస్తకాలు రాసుకోగలడు కాని పనిచేయించలేడు. కళాకారుడున్నాడు. వాడు శాస్త్రమూ తెలిసినవాడుకాడు, పనిచేసుకోగల్గిన వాడుకాడు. కాని వాడు రాసేద 'కవిత్వం. వాడిది 'కళ'.

కళాకారుడికి ఉన్న ఈ మనోధర్మం – వస్తువుని అనుభవంగా మార్చుకొని—ఆ అనుభూతి నుండి రాజకీయ నాయకుడో, శాస్త్రజ్ఞుడో చెప్పలేని రీతిలో ఒక మాట అనగలగడంలో పర్యవసిస్తోంది. శ్రీశ్రీకి మార్క్సిజం తెలీదని (రావిశాస్త్రికికూడా) ఒక పెద్ద అపనిందవుంది. మార్క్సిజం తెలియటం ఒక ఎత్తు. దాన్ని కవిత్వ రూపంలో అందివ్వటం మరో ఎత్తు. సత్యనారాయణగారికి మఠాధిపతులకన్నా ఎక్కువ శాస్త్ర పాండిత్యం వుండేదా! లేదు—కాని విశ్వనాథ మాత్రమే 'కల్పవృక్షం' రాయగల్గారు.

అందుచేతే శేంషేంద్రవంటివారు ఇటీవలి దశాబ్దంలో కవిత్వం 'ఆత్మకళ' అన్న ఒక నూతన అభిప్రాయాన్ని వెలువరిస్తూండటం చూడవచ్చు. 'ఆత్మ' అన్నంత మాత్రాన శేషేంద్ర కమ్యూనిస్టు వ్యతిరేకి అనుకోవడం మన తరంలో పడుతున్న పొరపాటు.

ఈ మాట లేవీ రాయకుండా రాస్తున్న నవలాకారుల్లో, వచన కవితా రచయితల్లో, నినాద మాత్ర కవుల్లో, చాలా మంది రాయిస్తులున్నారు, బూర్జువాలున్నారు. పరమ అవకాశ వాదులున్నారు. అందుకే తెలుగునాడులో 'విప్లవ' వాదం నేతిబీరకాయలాంటి దయి పోయేంత కృశించి పోయింది. విప్లవం అటు సాహిత్యంలో ఇటు జీవితంలో ఒకేసారి వస్తుందా! ఒకదాని తర్వాత మరోటి వస్తుందా! అని ప్రశ్న వేసుకొని-

"విప్లవ కవులు విప్లవం తీసుకురారు. ప్రజలే తీసుకువస్తారు" అని రాస్తున్నాం మనం. సమాజంలో మనం తీసుకుంటున్న 'role', నిర్వహిస్తున్న తీరు, నిర్ధరిస్తాయి, మనం ప్రగతికాంక్షులమా! వ్యతిరేకులమా! అన్నది- అంతే తప్ప సాహిత్యంలో రూపాన్నీ, వస్తువునీ మార్చినంత మాత్రంలో అది

ప్ర అనుకోవడం చాలా అసమంజస మైన విషయం.

ఇలా రాస్తున్న వారందరూ ప్రగతి వాద విధ్వంసకులే అన్న భావం మనలో చాలా మందికి ఉంది. గతి తార్కిక సాహిత్య భౌతిక వాదం ఒకటే శ్రేష్ఠమని మనలో చాలా మంది పొరబడుతున్నారు. సాహిత్య విషయంగా మార్క్సిస్టు ఆలోచనా సరళిలోని గతి తార్కికత- భౌతికత నూరికి నూరుపాళ్ళు అశాస్త్రీయాలని నిరూపింప బడ్డాయి. అందుకే 'హెగెల్' ని ఆధారంగా సాహిత్య సృజనను గురించి సోవియట్ విమర్శకులు మాట్లాడు కొంటున్నారు (చూ. Ovsyannikov. 1976).

సంపత్కుమార గారూ సోవియట్ రచయితల్ని ఉదహరించు కొన్నారు. ఇక్కడొక విషయం.

ఒకప్పుడు మన దేశంలో కమ్యూనిస్టు భావాలకి పాదుగా రష్యా గ్రహించ బడింది ఈనాడు చైనా స్వీకరింపబడుతోంది. రష్యా సామ్రాజ్యవాద ధోరణిని ఈనాడు మనం తిరస్కరిస్తున్నాం రష్యాలోవస్తున్న చాలా రచనల్లో 'సంప్రదాయం' (జిస్. మొదలైన రచయితల్లో) ఒక ఆసక్తికరమైన విషయం. సంపత్కుమార ఆయన మాటనీ ఉదహరించు కొన్నారు. ఆ జిస్ అన్న మాట ఇది: (చూ. సంపత్కుమార. పుట- 319)

'Yer innovation can nob be divorced from tradition'

(Avner Zis. 'foundation of Marxist Aesthetics p.p. 269)

ఈ మాటని బట్టి మనం వెంటనే తేల్చేస్తున్నాం- రష్యా విమర్శ కూడా క్రమక్రమంగా ప్రగతి వ్యతిరేకమై పోతోందని. అలా అనుకోవడం కంటె ఆ విమర్శకులు మునుపటి రోజుల్లో ఆలోచించినంత 'dogmatic'గా ఈ రోజుల్లో ఆలోచించడం లేద్దని ఎందుకనుకోకూడదు? మార్క్స్-ఎంగెల్స్ మహాశయులు ఉద్దేశించింది ప్రధానంగా రాజకీయాధికారానికి సంబంధించిన ఆర్థిక సూత్ర విధానాన్ని, అప్పటికి ప్రమరంగా ఉన్న విజ్ఞానశాస్త్రం వాళ్ళకి ఆ నేపథ్యాన్నీ ఆలోచననీ కల్గించింది. ఈ రోజుల్లో మార్క్స్ బతికి ఉంటే ఆయన తన మాటల్నే నిర్ద్వంద్వంగా తిరిగి రాసుకునేవాడు. ఆ హృదయ వైశాల్యం వాళ్ళకుంది కాబట్టే వాళ్ళ సాహిత్య చర్చల్లో అటు Eliotని కాని, ఇటు Richards ని కాని మరో వైపు Langer ని కాని కాదనడం లేదు. (ఈ సందర్భంలో చూ. Y. Basin's Semantic Philosophy Art 979).

విమర్శలో జీర్ణించిన సంప్రదాయాన్ని గురించి మాట్లాడటం వల్ల ఈనాటి మన అవగాహనలో వచ్చిన అభివృద్ధి ఏమాత్రం? అన్న విషయం అంచనా వేసుకోవాల్సి ఉంది. బ్రిటిష్ సామ్రాజ్యవాద ఫలితంగా ఇండియాలో కొత్త 'భావ' తరంగాలు వ్యాపించిన తొలి రోజుల్లో గురజాడ తరం అటు సృజనలో ఇటు విమర్శలో తెలుగు సాహిత్యాన్ని ఆధునాతనం చేశారు. (ఇక్కడొక విషయం. సంపత్కుమార గురజాడ 'మాటామంతీ' ని ఓ చోట ఉదహరించినా (పు.13) గురజాడలో మిగిలి పోయిన సంప్రదాయాను స్ఫూర్తిని గురించి ఎక్కడా రాయలేదు. బహుశా గురజాడ అసాంప్రదాయకుడని సంపత్కుమారగారూ భావిస్తున్నారేమో! ఇది తప్పనిపిస్తుంది. గురజాడ, కందుకూరి, కట్టమంచి వీరందరూ సర్వాత్మనా భారతీయత్వాన్నే ఆశించారు. కాని ఆంగ్లాన్ని- పాశ్చాత్యాన్ని సామాజిక ప్రయోజనాల కోసం అనుకరించారు. వాళ్ళలోని బూర్జువా అంతర్జాతీయ భావాలు ఈ దృక్పథ వైరుధ్యానికి కారణాలు కావచ్చు (చూ. కె. వి రమణారెడ్డి (1969); నారాయణరెడ్డి (1967)

గురజాడ తరంలో ఉన్న ఒక సామాన్య లక్షణం 'అన్నీ వేదాల్లో ఉన్నాయన' అనే భావాన్ని తిరస్క

రిస్తూ 'కన్నుగానని వస్తుతత్త్వము కొంచె నే స్వీకరించి రీజులు' అని స్మరించటం. ఈ భావపరంపర సర జాదలో వికటించకపోయినా సమకాలికంగానూ, ఆ తర్వాత కొంతకాలమూ విద్యావంతుల్లో భావదాస్యంగా మారిపోయింది. అంధానుకరణమైపోయింది. (ఈ అంశం మీద విమర్శకు చూ. ఆదిభట్లనారాయణదాసు గారి 'నవరస తరంగిణి' (1922).

విశ్వనాథ, శ్రీశ్రీ తరాలు చెరి ఒకవైపు యువత రాన్ని లాక్కుపోయాయి. పోతున్న ఈ రోజుల్లో అటు సంస్కృత సంప్రదాయంగానీ, ఇటు పాశ్చాత్య సంప్రదాయాలు గాని మనకి సర్వథా శిరోధార్యాలు కావనీ, మన సాహిత్యాన్ని కొలిచే ప్రమాణాల్ని అభ్యంతర ప్రమాణాల వల్లే (అంటే తెలుగు సాహిత్యాన్ని మధించటం ద్వారా మాత్రమే) నిష్పన్నం చేసుకోవాలని ఈనాడు మనం ఆకాంక్షిస్తున్నాం. (చూ. వెల్చేరు నారాయణరావు. 1980).

ఇలా ఆధునికసాహిత్యాన్ని కొలిచే నూతన ప్రమాణాలు ఏర్పరచు కోవడానికి సంపత్కుమార రచనల్లాంటివి చాలా సహకరిస్తాయి.

ఉదాహరణకు రసం, శిల్పం మొదలైన పరిభాషకు సాహిత్య విమర్శలో వచ్చిన అర్థ విపరిణామాన్ని గురించి తెలుసుకోవాలంటే తెలుగు సాహిత్యాన్ని (సృజనల్నీ, విమర్శల్నీ రెంటినీ పరిశీలించాలి) చారిత్రకంగా విశ్లేషిస్తూ, అందులో పాశ్చాత్య ప్రభావజన్యమైన కొత్త పరిభాషను అర్థనిర్ణయం చేస్తూ దేశ్య పరిభాషను అనుశీలించాల్సిన అవసరం ఉంది. ఆ బృహత్ప్రయత్నంలో ఇలాంటి సృజనాత్మకమైన విమర్శన రచనలు ఇంకా రావాల్సి వుంది. వస్తాయి కూడా. (చూ. బ్రహ్మానంద 1982)

"ఒక సిద్ధాంతం ఉంటే అది సూత్రప్రాయంగా చాలా మందికి సామూహికంగా వర్తించే విధంగా వుంటుంది. అన్వయంలో ఆచరణలో వ్యక్తుల మీద ఆ సిద్ధాంతం ఎలా పని చేస్తుందో సామాన్యంగా ఊహకు అందే విషయం కాదు... ఇక్కడే రచయిత, ముఖ్యంగా సృజనాత్మక రచయిత యొక్క బాధ్యత నిర్దిష్టమై ఉన్నట్టు నాకు తోస్తుంది. సాంఘిక పరిణామానికి మద్దతు నిచ్చినా, దాన్ని సర్దుబాటు చేసినా, విమర్శించినా సృజనాత్మక రచయిత తన వైయక్తిక దృక్పథం నుండి ఆ పని చేయాలి" (ఆర్. ఎస్. సుందరం 'రచన'లో (1974)

సంపత్కుమార లోని 'సంప్రదాయ రీతి' ఆ వైయక్తిక దృక్పథానికి సంబంధించింది. Khrapchenko వంటి వాళ్ళు (చూ. The Writers's individuality and development of Literature, 1977) ఈ అంశాన్ని ఈనాడు గుర్తించడటం కూడా మనం మరచిపోరాదు.

## ధర్శనీయ వాఙ్మయం : ప్రథమ భాగం


| | |
|---|---|
| Shri Aurobindo | 'The Future Poetry' (1953) |
| Swami Vivekananda | 'The East and the West' (1899-1901) (Pub. 1971) |
| Ananda Coomara Swami | 'The Dance of Shiva' (1956) |
| Pandey, K. C. | 'Abhinava Gupta' (1963);<br>'The Western Aesthetics' (1959) |
| Agrawala U. S. | 'Vision in Long Darkness' (1963) |
| Eliot, T. S. | 'Tradition and the individual talent',<br>in Selected Essays (1951) |

| | |
|---|---|
| Abraun, M. H. | 'The Mirror and the lamp' (1953) |
| Krishna Rao, G. V. | 'Studies in Kalapurnodayam' (1956) |
| Seshendra Sarma, G. | 'On Form and Language in Poetry' (1980) |
| Basin, Y. | 'Semantic Philosophy of Art' (1979)' |
| బ్రహ్మానంద, హెచ్. సి. | "వ్యంజన సూత్రము" (1981) |
| | "తెలుగు సాహిత్య విమర్శ : పాశ్చాత్య ప్రాభవం" (1982) |
| | "ఆలంకారికుల వాక్ తత్త్వ దర్శనం" (1980) |
| | "విశ్వనాథ సంప్రదాయ దృష్టి" (1973) |
| కోటేశ్వరరావు, తుమ్మపూడి | "ఆనుశాసనిక పర్వ పీఠిక" (1974) |
| | "సహృదయ తత్త్వం" (1980) |
| | "రసజ్ఞుడు" (1976) |
| | "సహృదయ తత్త్వం - వాల్మీకి" (1971) |
| | "కుమార భారతి" (పీఠిక) (1981) |
| | "విశ్వనాథ సాహిత్య విమర్శ సూత్రం" (1971) |
| | "శాంతరస వివేచన" (అము.) |

ద్వితీయ భాగం :

| | |
|---|---|
| Basin, Y. | 'The Semantic Philosophy of Art' Moscow (1979) |
| Khrap chenko, M. | 'The Writer's Individuality and the development of literature', Moscow (1977) |
| Ovsyannikov, M. | 'Questions of Hegel's Methodology of Aesthetic Research and the present day', in Marxist Leninist Aesthetics (1976) |
| నారాయణదాసు, ఆదిభట్ల | "నవరస తరంగిణి" 1922, (పునర్ముద్రణ 1978) |
| నారాయణరావు, వెల్చేరు | "తెలుగులో కవితా విప్లవాల స్వరూపం" (1978) |
| | "తెలుగు పరిశోధనల తీరుతెన్నులు", అభ్యుదయ విశేష సంచికలో (1980) |
| నారాయణరెడ్డి, సి. | "ఆధునికాంధ్ర కవిత్వము - సంప్రదాయములు, ప్రయోగములు" (1967) |
| మందేశ్వరరావు, వడలి | "సాహిత్యంలో ఆధునికత", భారతి జూలై (1978) |
| రమణారెడ్డి, కె. వి. | "మహోదయం" (1969) |
| సాంధ్యశ్రీ | "సంప్రదాయం ప్రగతి వ్యతిరేకమా", భారతి, ఫిబ్రవరి 1978 |
| సుదర్శనం, ఆర్. ఎస్. | "రచన" (వ్యాస సంపుటిలో) (1974) |
| సొసైటీ ఫర్ సోషల్ ఛేంజి వారి ప్రచురణ | "ప్రజాస్వామిక సంస్కృతి : కందుకూరి గురజాడల దోహదం" కావలి (1980) |


తెలుగు లెక్చరర్, యస్. కె. కాలేజ్,
అనంతపురం.

# సాహిత్యగోష్ఠి

## అస్తిత్వవాదం – 2

అస్తిత్వవాద దర్శన ప్రవర్తకులూ, రచయితలూ అయినదాదాపు పదిమందివరకు ఆచార్యులున్నా సార్త్ర కారణంగానే అస్తిత్వవాద సిద్ధాంతం ఎక్కువ ప్రచారంలోకి వచ్చింది. కామూ, కాఫ్కావంటి వారు కూడా అందుకు ఎక్కువ తోడ్పడిన వారే. ఈ రచయితల కారణంగా విశ్వసాహిత్య రంగంలో ఆ వాదానికి ప్రముఖస్థానం ఏర్పడింపబడంలో సందేహం లేదు. అస్తిత్వవాద సౌందర్య శాస్త్రాన్ని గురించి వివరిస్తూ సార్త్రి ఆ సౌందర్యం ఒకవైపుముద్రతో గాక రెండు వైపులా బొమ్మ బొరుసు రూపాలలో అభివ్యక్తం కావడం అవసర మన్నాడు ఒకటి బాహ్యరూపం. ఇంకొకటి అంతర్గతమైన రహస్యరూపం. వస్తుగత సౌందర్యాన్ని కేవలం బాహ్యదృష్టితోనే దర్శించ దలచుకొంటే అది దృశ్య సాధ్యమైన రూపంగానే ఉండి పోతుంది. నిజమైన కళాకారుడూ, రచయితా సౌందర్యాన్ని ఆత్మగతం చేసుకొని దానిని కృతి రూపంలో వ్యక్తీకరిస్తాడు. దర్శకుడు, పాఠకుడు ఆ సౌందర్యాన్ని అనుభవించేటప్పుడు పూర్తిగా దానిని పునర్నిర్మాణం చేస్తాడు అంటే అస్తిత్వవాదపు సౌందర్యం తాలూకు విలువల్ని గ్రహించడంలో పాఠకుని పాత్ర కూడా చాలా ముఖ్యమైనదన్నమాట సార్త్రి దృష్టిలో కళ ఒకానొక ఆశయయుక్తమైన (Intentionel Act) క్రియ. అది కల్పన ద్వారా సంచాలితమవుతుంది. కల్పన కళాకారుని స్వాతంత్ర్యాన్ని వ్యక్తీకరిస్తుంది. ఎందువల్లనంటే అది లభించిన స్థితినుండి ముందుకు సాగి, పెరిగి, వస్తువునూ, దాని సారరూపాన్నీ సృష్టిస్తుంది. కళాభోక్త. పాఠకుడు కృతిని వస్తురూపంలో చూచి స్వతంత్రుడుగా దానిని అనుభవిస్తూ దానినే పునర్నిర్మిస్తున్నాడు అనగా వస్తువు ముఖ్యమై కళాకారుడు మొదటి స్థితిలో గౌణు డవుతున్నాడు. కళాకృతినిర్మాణానికి పూర్వం కళాకారుడు ముఖ్యుడూ, కృతి గౌణంగా వుంటుంది. కళాకారుడూ, సహృదయుడూ ఇద్దరూ కలిసి సౌందర్య నిర్మాణ, పునర్నిర్మాణాలను చేస్తారు. రచయిత పాఠకునికి సౌందర్యానుభూతిని కలిగిస్తున్నాడు. దాని మీదనే రచయిత శక్తి ఆధారపడి వుంటున్నది.

ఏ పరిస్థితుల్లో రచయిత జీవిస్తుంటాడో అదే పరిస్థితుల్లో పాఠకులుగూడా జీవిస్తుంటారు. అందువలన అస్తిత్వవాద రచయిత పరిస్థితుల్ని మార్చడంలో, లేక ఆ పరిస్థితుల్ని సమూలంగా పెకలించివేయడంలో తనకెంత తీవ్రమైన కాంక్ష ఉన్నదో పాఠకునిలోగూడా అటువంటి కాంక్ష వుండవలెనని అభిలషిస్తాడు. పాఠకులు తనతోపాటుగా తనతో సమానంగా ముందుకు సాగవలెనని అస్తిత్వవాద రచయిత కోరుకుంటాడు.

ఏ కృతినిర్మాణం జరిగినా సాహిత్యకారుని వ్యక్తిత్వం ఆ కృతితో సంబద్ధమై వుంటుంది. రచయిత తన స్వాతంత్ర్యాన్ని గుర్తుంచుకొంటూనే విశ్వంతో తనకు గల సంబంధ స్వరూపాన్ని కృతిలో అంకితం చేస్తుంటాడు. అంటే కళాకారుని జీవనదర్శనమే అతని కళాకృతులలో అభివ్యక్తమవుతూ, ప్రతిబింబితమవుతూ వుంటుంది. సార్త్రి మాటలప్రకారం జ్ఞేయవస్తువు రచయితలో అంతర్నిహితంగావుండి, అతణ్ణి సాధనంగా చేసుకొని రచనద్వారా అస్తిత్వంలోకి వస్తుంది. రచయిత మస్తిష్కంలో ఒకానొకచిత్ర మున్నంతమాత్రాన ప్రయోజనం లేదు. అది రచనలో అభివ్యక్తం కావాలి. కళాకారునిలో వ్యక్తిగతమైన అహం వుంటుంది. అది కృతిరూపంలో ఆకారాన్ని ధరిస్తుంది. ఈనాటి భయంకరమైన వ్యవస్థావాద పరిధులలోనుండి వ్యక్తిని పై

శేవదీసి అతనిలో స్వతంత్రతాభావాన్ని రేకెత్తింపజేసి స్వాతంత్ర్య ప్రతీతిని కలిగించడమే సాహిత్యం యొక్క, కళ యొక్క ప్రధాన లక్ష్యమని అస్తిత్వ వాదుల అభిప్రాయం. కీర్కెగార్డ్ కవి అంటే ఎవరు? అని ప్రశ్న వేసుకుని అతడు దుఃఖభరితుడైన ప్రాణి అనీ, అతని హృదయం ఎల్లప్పుడూ ఏదో రహస్యమయమైన వేదనతో కూడుకొని వుంటుందనీ, ఆ వేదన రోదనంగా వెలువడితే దానిలోనుండి సంగీతమయమైన మాధుర్యం వ్యక్తమవుతుందనీ, అట్టి స్థితిని నిర్మించినవాడే కవి అనీ జవాబు చెప్పుకున్నాడు. సార్త్రెగూడా అదేవిషయాన్ని ఇంకొకవిధంగా వ్యక్తంచేస్తూ దుఃఖంవలన కలిగిన ఛీత్కారం ఏదో వేదనను తెలియజేస్తుంది. దుఃఖగీతాన్ని వెలువరిస్తుంది. ఆ దుఃఖగీతం వేదనేగాక "ఇంకా ఏదో" అవుతుందన్నాడు. నిజానికి సాహిత్యకారుడు మాత్రమే మానవునిఅంతరాంతరాళాలలో నిగూఢంగా ప్రజ్వరిల్లుతున్న వేదనను, బాధను తెలుసుకొని దానిని తాను అనుభవించి దానితాలూకు అస్తిత్వాన్ని, సత్యాన్ని తెలుసుకుంటాడు. సాహిత్యము, స్వాతంత్ర్యము రెండూ పరస్పరం అన్యోన్యాశ్రితాలు అన్నాడు సార్త్రె. అస్తిత్వవాదులు ఈ ప్రపంచాన్ని అసంగతులు. విసంగతుల మధ్యనుండి వాటి మాధ్యమంగానే చూస్తుంటారు. ఇది ఒక విచిత్రమైన విషయం,

నిబద్ధత విషయంలో గూడా సార్త్రె ఒక ప్రత్యేకమైన అభిప్రాయాన్ని వెల్లడించాడు. రచయిత సమసామయిక సమస్యల్నీ, ప్రశ్నల్నీ, పరిష్కరించడానికి తప్పక కృషిచేయాలి. నిబద్ధత వలన సాహిత్యకారుని శక్తి కుంచితమవుతుందనే వాదన సరిగాదు. జీవితం కటువుగా ఉన్నప్పుడు ఆ కటుత్వం సాహిత్యంలో ప్రతిబింబించడం స్వాభావికం. సాహిత్యం అనగా ఆత్మచిత్రణ. రచయిత ఆత్మచిత్రణ చేయడంలో నిబద్ధతకలిగి వుంటాడు. ఉండాలి అన్నాడు సార్త్రె. మీపాత్రలు కురూపంగా ఉంటున్నవి, మీ పాత్రలు దుష్టపాత్రలు, అనే నిందకు జవాబుచెప్తూ సార్త్రె మా పాత్రలు మనుష్యునికి ఆత్మ సాక్షాత్కారం చేయిస్తున్నవన్నాడు. అస్తిత్వవాదులు శివం, అశివం, సుందరం అనే దృష్టితో పాత్రలనిర్మాణం చేయరు. జీవితంలోపతితులుఉదాత్తులు కావడం, ఉదాత్తులు పతితులు కావడం, ఒకరే కొంతసేపు పతితులు, కొంతసేపు ఉదాత్తులు కావడంగూడా చూస్తున్నాము. ఇది మనం నిత్య జీవితంలోచూస్తున్న నగ్నసత్యం. మా పాత్రల స్వరూపంగూడా అటువంటిదేనంటారు అస్తిత్వవాదులు. ఎర్రగులాబీలు, ఎర్రపెదవులు మాత్రమే సుందరంగా ఉంటవని ముందుగానే ఎందుకు భావించాలి? నల్ల గులాబీలు, నల్ల పెదవులు గూడా సుందరంగా వుండవచ్చును. కనుక ఏ పాత్రను గురించిగూడా ముందుగానే నిశ్చితాభిప్రాయం ఏర్పరుచుకొనడం-అంటే పూర్వ ధారణ పనికిరాదని అస్తిత్వ వాదుల అభిప్రాయం. సార్త్రె కొన్ని సిద్ధాంతాలకు కట్టుబడినవాడు. ఆయన 1964లో నోబుల్ బహుమతిని తిరస్కరించాడు. అదే సందర్భంలో ఒక ప్రకటనచేస్తూ ఏ సిద్ధాంతాలు సాహిత్యకారునికి ముఖ్యమైనవని నేను విశ్వసిస్తున్నానో, రచయితల బాధ్యత విషయంలో ఏ గుణాలు ఉండడం అవసరమని నేను భావిస్తున్నానో వాటిని దృష్టిలో పెట్టుకొని నేను ఈ బహుమతిని నిరాకరిస్తున్నానన్నాడు. రాజకీయంగా, సామాజికంగా లేక సాహిత్యపరంగా ఒకానొక విశిష్టదృష్టిగలిగిన రచయిత తన రచనలద్వారా ప్రశస్తిని సంపాదించవలసిందేగాని సన్మానాలూ, సత్కారాలద్వారా కాదన్నాడు. అటువంటి సన్మానాలూ, సత్కారాలూ అతని రచనావిధానాన్ని, ప్రత్యక్షంగానో, అప్రత్యక్షంగానో ప్రభావితం చేయగలవనీ, దానివలన అతని స్వాతంత్ర్యం, సహజశక్తి మారిపోయే ప్రమాదమున్నదనీ సార్త్రె అభిప్రాయం. సాహిత్యమనగా నేమి? అనే గ్రంథంలో సార్త్రె రచయితల బాధ్యతలు, గుణాలనుగురించి వివరంగా చర్చించాడు, జీవితంలో మనం మనకే నిబద్ధులం. నిబద్ధులమై మనం మన రచనల్లో ఆత్మ చిత్రణ చేస్తున్నాము. మన రచనల్లో నిజాయితీ, కలిగిన స్వరూప చిత్రణ వుండాలి అన్నాడు. ఇదే సందర్భంలో శిల్పం, జిలుగుడువంటి వాటిమీద ఆధారపడే రచయితల్నిగురించి హెచ్చరిస్తూ వాటిమీద ఎక్కువ ఆధారపడడంవలన లోపలి సౌందర్యం నష్టమై

పైపై మెరుగులుమాత్రమే, అలంకారాలుమాత్రమే మిగిలే ప్రమాదమున్నదన్నాడు. సార్త్రే, కామూ, కాఫ్కా వంటివారు విశిష్ట రచనలుచేసి అస్తిత్వవాదానికి విశ్వసాహిత్య జగత్తులో ఒక ప్రత్యేకతను సంతరించి పెట్టారు.

వే. ఆంజనేయ శర్మ
రిజిస్ట్రార్
పి. జి. కాంప్లెక్సు
హైదరాబాదు

# బంగోరెకు ఆంధ్రులు కృతజ్ఞులై వుండాలి

ఇదేమిటిదేమిటి ? ఇది నిజమా ?
ఇది అబద్ధం కారాదా ?
ఆకాశమా చెప్పు
వార్తాపత్రికా చెప్పు
గంగానదీ కనీసం నువ్వయినా చెప్పు !
మా బంగోరె మరి లేరా ?
కనకం కంటె విలువైన,
మొదటి కన్యాశుల్కాన్నిచ్చిన బంగోరె !
బ్రౌన్ జాబుల్ని, డైరీల్ని, ఛందస్సునీ
తళ తళలీనే తాతాచార్ల కథల్ని
తెలుగుపుస్తకాల ప్రచురణ చరితల్ని
మరుగునపడిన మాలపల్లి పేజీల్లోని
మాసిపోని చరిత్రనీ....
వేమన చిమ్మిన వెలుగుల్ని, కట్ట–మంచినీ
అన్నట్టు వీరేశలింగం కీర్తి చంద్రికల్ని
అయ్యో-ఎన్నని చెప్పను ?
బంగోరె–బంగోరె....
మీ జ్ఞాపకాలు ఎన్నెన్ని
కళ్లల్లో నీళ్లలా పరుగులు తీస్తున్నాయో !
అయినా మృత్యువుకయినా బుద్ధిలేదా ?
మొన్న మొన్న చెరబండరాజు !
నిన్నటికి నిన్న కుందుర్తి !
ఈనాటికీనాడు ...బంగోరె ?
సరే...సరేలే....మృత్యువా...
బంగోరె కు మృత్యువేమిటి ?
...అంటే తెలుగుభాషకే మృత్యువు !

## అసామాన్య పరిశోధనలు

నాటికి నేటికి నేను గురజాడ ఎడ్మయిరర్ని. శ్రీశ్రీ మాటల్లో చెప్పాలంటే "అడుగుజాడ గురుజాడది అది భావికి బాట, మనలో వెధవాయిత్వం మరిపించే పాట". అప్పటికే గురజాడ రచనలన్నిట్నీ మరీ ముఖ్యంగా కన్యాశుల్కాన్నీ ఒకటికి రెండుసార్లు చదివినవాణ్ణి, అంట్యాకుల పైడిరాజుగారు తయారిస్తున్న గురజాడ వారి విగ్రహాన్ని ప్రతిస్థాయిలోనూ తిలకిస్తున్నవాణ్ణి, గురజాడ వారి కొమాఋల్లు రామదాసుగారితో ప్రత్యక్ష పరిచయం కలవాణ్ణి...1969లో బంగోరె ప్రచురించిన మొట్టమొదటి కన్యాశుల్కాన్ని చదివాను దాదాపు ఆకాలంలో నేరమణారెడ్డిగారి 'మహోదయం' చదివాను తెలుగుదేశంలోని ఎందరెందరో సామాన్య పాఠకులతో పాటు నాకు 'బంగోరె' అత్యంత సన్నిహితంగా కనిపించారు. నా భావాల్ని అప్పట్లో సోమసుందర్ గారితో పంచుకున్నాను, మొదటి ముద్రణకు, రెండవ ముద్రణకు గురజాడ ప్రిఫేస్, ఆరుద్ర అభిప్రాయాలు 84 పేజీలు + మధురవాణి పాత్రగురించి ఆరుద్ర వ్యాసం పునర్ముద్రణ, రమణారెడ్డిగారి ఒకటి రెండు మాటలు, బంగోరె సుదీర్ఘ చర్చతోకూడిన ముందు మాటలు,...ఇవన్నీ మరో 72 పేజీలు+కన్యాశుల్కం (నోట్సుతోసహా టెక్స్ట్), అనుబంధాలు వివరణలు, వ్యాఖ్యానాలు 172 పేజీలు...ఇదికాక అట్టపై దేశ విదేశీ భాషల్లో 'కన్యాశుల్కం' అనే అపురూప సమాచారం...ఇది నిజంగా భారీఎత్తున జరిగిన సాహిత్య విందు. ఎక్కడా 'ఎకడమిక్' దృష్టి కనపడదు. చిత్తశుద్ధితోకూడిన పరిశోధనా తత్పరతే కానవస్తుంది. కొడవటిగంటి కుటుంబరావు, నార్ల వెంకటేశ్వరరావుగార్ల వంటి ఎందరెందరో పరిణత ప్రజ్ఞుల్ని తలలూపించిన గ్రంథం ఇది !

ఆ తరువాతిది 'చంద్రిక కథ.' (ఏప్రిల్ 71) తెలుగు మహాపురుషుడు వీరేశలింగం పంతులుగార్ని పాత్రగా తీసుకుని ఆధునిక తమిళ మహాకవి సుబ్రహ్మణ్యభారతి వ్రాసిన తమిళ నవలకు "గోపాల-కృష్ణ-రాఘవన్"గార్ల తెలుగుసేత. పీఠికలోనిగోపాలుడు బండి గోపాలుడే. వీరేశలింగం పంతులుగార్ని గురించి రమణారెడ్డిగారి వ్యాసం, 'భారతి'పై చల్లా రాధాకృష్ణగారి వ్యాసం, బంగోరె సందర్భంగా సంతరించిన పరిశోధనాచర్చ (52 పేజీలు) + ఎడనెడ వివరణలతో కూడిన 'చంద్రిక కథ' టెక్స్ట్ 56 పేజీలు. ఈ గ్రంథాన్ని వెలికితీసినందుకు అటు తమిళులూ, ఇటు తెలుగులూ కూడా బంగోరెకు కృతజ్ఞులై వుండవలసిందే.

బ్రౌన్‌పై నిలిచినదృష్టి బంగోరెది. ప్రధాన దృష్టి-కాస్త ప్రక్కకు జరపగా వెలికివచ్చిన అపూర్వ రత్నాలు పైన పేర్కొన్న గ్రంథాలు. ప్రసిద్ధ పరిశోధకులు కొత్తపల్లి వీరభద్రరావు-అకాడమీ సహకారంతో వెలయించిన 'బ్రౌన్‌చరిత్ర'లోని ఎన్నెన్నో పొరపాట్లనూ, పొల్లుసమాచారాలనూ సోపపత్తికంగా బయటికి తెచ్చినవారు బంగోరె, బ్రౌన్‌పై చేస్తున్న ఆ మహా పరిశోధనా యజ్ఞంలోంచి — వెలికివచ్చిన గ్రంథం "బ్రౌన్ జాబులు-తెలుగు జర్నలిజం చరిత్ర (1832–1857 ఇది 1973 అక్టోబర్‌లో ప్రచురించారు బంగోరె. ఇది 150 పేజీలకు మించిన అపూర్వ సమాచారంతో, వివరణలతో, పీఠికలతో వెలువడింది.

ఇక్కడికి బంగోరె గ్రంథాలు మూడు. ఈ గ్రంథాలన్నిటికీ ముద్రణావ్యయం, భారం వగైరాది సమస్త బాధ్యతలు బంగోరెవి! అంతంత బృహత్ గ్రంథాల్ని అన్ని బాధ్యతలూ పైన వేసుకుని వెలువరించడం-ఆ బాధ అనుభవించినవారికి తప్ప అర్థంకాదు. మహానుభావుడు గురజాడ తెలుగుదేశంలో కవుల, పండితుల బాధలు నూరేళ్ల క్రితమే వ్యక్తంచేశాడు! అది ఈనాటికీ నిజంకావడం ఎంత దురదృష్టకరం!

'బ్రౌన్ జాబులు' అనే గ్రంథాన్ని ప్రెజంట్ చేయడానికి-యం. శేషాచలం అండ్ కో అధినేత యం.ఎన్. రావుగారి దగ్గరకు వెళ్ళిన బంగోరె 'తాతాచార్ల కథలు' ఎడిట్ చేసే బరువుతో బయటికి వచ్చారట. ఎమెస్కో పాకెట్ బుక్‌గా వెలువడిన (జూలై 1974, 284 పేజీలు ఈ గ్రంథానికి "ముందు మాటలు"లో బంగోరె భావాలు చిత్రగించండి.

"కొండను త్రవ్వి ఎలుకను పట్టడం నాచేతకాదు. అది నా తత్వమూ కాదు. ఎలుకను తవ్వి, కాదంటే దువ్వి కొండను కొట్టడం నాకు వచ్చినపని. ఇదేదో పి. హెచ్,డి డిగ్రీకోసం పడే కష్టకార్తికాదు. ఏదో పవిత్ర బాధ్యతగా ఎంచి అందులో ఐక్యమైపోయే ఒక తౌల్యం. మన పి. హెచ్‌డి పండితులు పనికిరావని పారవేస్తున్న నిరాదరిస్తున్న అంశాలు కొన్నిటిని పట్టుకుని వేగులాగడం నావంతు అయినట్లున్నది, గతంలో నే చేసిన రచనల్లో ఇదే జరిగింది. ఇప్పుడు బ్రౌన్ విషయంలోనూ ఇదే జరిగింది."

ఈ వాక్యాల తరువాత పరిశోధనాంశాలకోసం రీసెర్చ్ స్కాలర్లు, లెక్చరర్లు పడే శ్రమ కష్టాలు చెప్పారు బంగోరె. నిజంగా ఎంతో బాధాకరమైన విషయాలవి. ఏ అంశాన్ని తీసుకున్నా 'పవిత్రబాధ్యత' గానూ, కూలంకషంగానూ పరిశోధించే తత్వం బంగోరెది. ఎంత ఆహ్లాదకరమైనవి తాతాచార్ల కథలు!

బంగోరె ప్రచురించిన మరోగ్రంథం జె. మంగమ్మగారి—తెలుగు పుస్తకాల ముద్రణాచరిత్ర. మంగమ్మగారు దేశదేశాల్లోనూ అచ్చయిన తెలుగు పుస్తకాల ముద్రణాచరిత్రను రాదాపు 400 పేజీల గ్రంథంగా రచించారు. ఎన్నో గ్రంథాల ప్రథమ ముద్రణాముఖపత్రాల 'ఫాక్సిమిలీ' కాపీలు ఇందులో కానవస్తాయి. మంగమ్మగారి ఈ అపూర్వ కృషి వెనుక బంగోరె సహకారం కొట్టవచ్చినట్టు కనపడుతుంది. ఆంగ్లంలోవున్న ఈ గ్రంథం ప్రపంచంలోని ఏ పండితుడివయినా అత్యంతంగా ఆకర్షిస్తుంది, ఎన్నో ఆలోచనల్ని రేకెత్తిస్తుంది.

1976 జూలై తొలివారంలోనని గుర్తు. ఆంధ్ర విశ్వవిద్యాలయంలో "ఆలిండియా లింగ్విస్టిక్స్ కాన్ఫరెన్స్" జరిగింది. నేనూ 'పత్రం' చదవడానికి వెళ్లాను. అప్పుడు తొలిసారి బంగోరెతో పరిచయమయింది. ఆ మూడు రోజుల్లోనూ ఒకనాటి సాయంత్రం విశాఖపట్నం హిందూ రీడింగ్ రూంలో చేకూరి రామారావు, బూదరాజు రాధాకృష్ణమూర్తి, బంగోరెగార్ల ఉపన్యాసాలు ఏర్పాటయ్యాయి. (అయ్యా పురిపండావారూ,

మీరే అధ్యక్షించారు గదూ). అప్పుడు స్వయంగా చూశాను బంగోరె వార్ధక్యం, పట్టుదల, పరిశోధకుల పొరపాట్లపై ఆయన కోపం... వేమన పద్యాల్లో పండి తమ్మన్యులు చేసిన పొరపాట్లు ఒక్కటొక్కటీ చెబుతూంటే సభయావత్తు ముక్కుపై వేలు వేసుకున్నది.

ఆ తరవాత శ్రీ వెంకటేశ్వర విద్యాలయంలో సి.పి. బ్రౌన్ ప్రాజెక్టుకు అధిపతిగా బ్రౌన్ డైరీలు, బ్రౌన్ వెలయించిన తెలుగు ఛందము వగైరా గ్రంథాలు ప్రకటించారు. ఇందుకు ప్రభుత్వమూ, విశ్వవిద్యాలయమూ ఆర్థిక సహకారం అందించింది.

ఇంచుమించు ఆ సమయంలోనే (కొంచెం ముందో) "మాలపల్లి నవలపై ప్రభుత్వ నిషేధాలు" (1979, విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్, విజయవాడ) అనే గ్రంథం సంతరించారు. బంగోరె ముందుమాటలు కాకుండా దిగవల్లి వెంకట శివరావు, కె. వి. రమణా రెడ్డి, నగ్నమునిగారలు నాటి విషయాలను నేటి విషయాలను గురించి పరిచయవ్యాసాలూ, 81 పేజీలలో మాలపల్లి వ్యవహారాన్నంతా విడమరిచిచెప్పిన బంగోరె రచన, 20 పేజీలలో కొన్ని అనుబంధాలతో, చాలా వివరణాత్మకంగా నడచిన ఈ రచన–వెంకట శివరావు గార్నట్లు "ఆధునికాంధ్ర దేశ చరిత్రకు వాఙ్మయ చరిత్రకు అమూల్యమైనది. ఆంధ్రదేశమున్నంతవరకూ 'మాలపల్లి'ని చదవక తప్పదు. మాలపల్లికోసం బంగోరె గ్రంథాన్ని చదవక తప్పదు. (పై వాక్యాలు కాకుమాను తారానాథ్‌గారివి. తారానాథ్‌గారు ఈ గ్రంథాన్ని భారతి (1980 డిసెంబరు 78, 79 పేజీలు, లో సమీక్షిస్తూ చివరగా ఒక్కమాట అన్నారు: బంగోరెకు ఆంధ్రులు సర్వదా కృతజ్ఞులై ఉండాలి సుమా."

బ్రౌన్ ప్రాజెక్టుపై చాలా విమర్శ చెలరేగింది. అనేకులు దానిని కొనసాగించమని విజ్ఞప్తులు చేశారు. కాని అది సాగలేదు మానసికంగా బంగోరెను అది బాగా కుంగదీసివుంటుంది, (తిరుపతి దేవస్థానంవారి ఆర్థిక సహకారంతో ప్రచురించబడిన వేమన పద్యాలు– బంగోరె ఎన్నిక చేసినవి – అతి చవుకధరకు లభ్యం అయ్యాయి కాని అందరికీ లభించలేదు.) మానసికంగా వేదన అనుభవిస్తున్నదశలో–తన ప్రియమైన ప్రాజెక్టు గురించిన తపనతో–1980 డిసెంబర్‌లో వారు నాకు మరికొందరు మిత్రులతో కలిసి హైదరాబాద్‌లో కనిపించారు. వెనుకనుంచి నా భుజాలుపట్టి తనవైపు తిప్పుకుంటూ గుర్తుపట్టారా నన్ను అన్నారు. చలి సాయంత్రంలో మఫ్లర్ చుట్టుకున్నవ్యక్తిని అప్పుడు గుర్తుపట్టాను. ఎంత మార్పు భౌతికంగా! అయినా ఎంత పట్టుదల! ఒక సంవత్సరకాలం తాను హైదరాబాద్‌లోనే (తిరుపతి దేవస్థానంవారి ఆర్థిక సహకారంతో నడిచే ప్రాజెక్టు) వేమన విజ్ఞానకేంద్రంలో వుండనున్నట్టు చెప్పారు.

అ తరువాత ఆంధ్ర విశ్వవిద్యాలయం వచ్చి సి. ఆర్. రెడ్డి రీసెర్చి ప్రాజెక్టులోచేరి వేమన-సి.ఆర్.రెడ్డి అనే ఆంగ్ల గ్రంథం ప్రచురించారు. ఆ గ్రంథంలో కట్టమంచి రామలింగారెడ్డిగారి జీవితానికి, సాహిత్య వ్యక్తిత్వానికి సంబంధించిన ఎన్నో విషయాలను చర్చించారు.

పరిశోధనలో 'దాహం' తీరనివ్యక్తి బంగోరె. పరిశోధనే జీవితమైన వ్యక్తి బంగోరె. పరిశోధనా వ్యాసంగంలో ఎందరెందరికో సహకరించిన వ్యక్తి బంగోరె,

బంగోరె గురించి విననివినినా అంతగా తెలీని వారికోసం (నా మనసులోని బరువు దించుకోవడంకోసం) ఈ వ్యాసం రాస్తున్నాను. కొన్ని సాధారణ జీవిత విశేషాలు మనవిచేస్తాను.

## సామాన్య విశేషాలు

జననం (1936-37) నెల్లూరుజిల్లా మినగల్లులో. వాత్తేరులో చదువు సంధ్యలు, బి. కాం. (ఆనర్స్) ఎక్స్ట్రా. [ఈ సర్టిఫికెటు రీసెర్చి ఆఫీసర్‌గా ప్రాజెక్టు అధిపతిగా ఆయనకు ఎలా అర్హతనిస్తుంది అని (నాతో) కొంతరి ప్రశ్న చిత్తశుద్ధితోచేసిన పరిశ్రమకు నిదర్శనంగా అక్షరరూపంలో అనేక గ్రంథాలు వుండగా ఇంకేంకావాలి నా ప్రతి ప్రశ్న.] ఆంధ్రజ్యోతి దినపత్రిక ప్రారంభించిన కొత్తలో కొన్ని నెలలు ఉపసంపాదకుడుగా పనిచేశారు. దాదాపు గత అర్ధశతాబ్దంగా వెలువడుతున్న సుప్రసిద్ధ నెల్లూరు వారపత్రిక "జమీన్ రైతు"లో సహాయ సంపాదకుడిగా ఆరేళ్లు

పనిచేశారు. (మొట్టమొదటి కన్యాశుల్కం, చంద్రిక కథ ఆకాలంలో వెలువరించినవే. ఆ తరువాత 1971లో మద్రాసులోని అమెరికా సమాచార శాఖలో రెండు న్నర సంవత్సరాలు పనిచేసి, అనంతరం నెల్లూరు వార పత్రిక "యూత్ కాంగ్రెస్'లో పనిచేశారు. తిరుపతిలో, హైదరాబాద్, కడపసారి వార్తలలో పరిశోధనా కార్యక్రమాల్లో పని ముగిసిన అనంతరం-మద్రాసులోని మిషనరీలు ఒక రిసెర్చి ప్రాజెక్టులో పనిచెయ్యమని ఆయన్ని అడిగారట. వారు పంపిన ఒక మనిషితో కలిసి చిత్తూరు బయలుదేరుతున్నట్లు ఇంట్లో చెప్పారట బంగోరె. కాని విచారించగా మిషనరీల ప్రాజెక్టువారు మనిషిని పంపలేదనీ, తాను పని చెయ్యనని ముందుగానే వారికి బంగోరె వ్రాసినట్లు తెలుస్తోంది. హిమాచల ప్రదేశ్‌లోని భాక్రావద్ద సట్లెజ్ నదిలో గుర్తుతెలియని వ్యక్తి దూకి ఆత్మహత్య చేసుకున్నట్లు పోలీసువారి సమాచారం. వారికి లభించిన ఆధారాల ప్రకారం ఆ వ్యక్తి బంగోరె. విశ్వవిద్యాలయాల వ్యవహారంతో, విద్వాంసుల వేషం వేసుకున్న వ్యక్తుల వంచనా కార్యాలలో, విసిగి వేసారి, చివరిదినాల్లో విశాఖలోని అతి సన్నిహిత మిత్రునికి ఉత్తరం రాస్తూ "త్వరలో బంగోరె అనే సూర్యుడు అస్తమిస్తున్నాడు. ఇక కనపడడు." అని రాశారట, తెలుగులోనూ, ఇంగ్లీషులోనూ డజనున్నరకు పైగా అపూర్వ పరిశోధనాగ్రంథాలు ప్రచురించిన బంగోరెకు ఏ విశ్వవిద్యాలయాల ఎకడమిక్ డాక్టరేట్ల మచ్చలూ లేకపోవడం...మంచిదే! 'ఓ ఆచార్యవర్యులారా! ... మన సాహిత్యచరిత్రను తిరిగి వ్రాయవలసిన అవసరం చాలావుంది. ఈ విషయాలను కొంచెం పట్టించుకోండి. మీ శిష్యుల్ని ఈ పనికి పురమాయించండి...అన్న బంగోరె మాట (తాతాచార్ల కథలకు ముందుమాటలో) ఆంధ్రులందరి చెవిలో రింగురుమటూనే వుంటుంది.

## చివరి మాట

జమీన్ రైతులో 'కూని రాగాలు' తీసినా, కన్యాశుల్కమే తవ్వినా, కడపజిల్లా ఊళ్ళపేర్లే పరిశోధించినా చిత్తశుద్ధితోనూ, ఒక పవిత్రకార్యంగానూ చేశారు. తెలుగులో అటువంటి పరిశోధకుడుండటం గర్వకారణమైతే, ఆయన్ని వలపై ఆయిదేళ్ళ ప్రాయంలోనే నష్టపోవడం-తెలుగువారి నేరం కాని నేరం.

బంగోరెకు ఆంధ్రులు సర్వదా కృతజ్ఞులై వుండాలి.

[ఈ వ్యాసం రచించిన తేదీ ; 2-11-1982]

మానేపల్లి సత్యనారాయణ
తెలుగు లెక్చరర్
కోట స్ట్రీట్
చోడవరం, విశాఖజిల్లా, 531036

* * *

### శబ్దానికన్నా అర్థానికే అత్యధిక ప్రాధాన్యం ఇచ్చిన కవిత

# శేషేంద్ర 'ప్రేమలేఖలు'

పేరెన్నికగన్న ఆధునికాంధ్ర కవుల్లో గుంటూరు శేషేంద్ర శర్మ గారొకరు. వీరి రచనల్లో 'శేష జ్యోత్స్న', 'మండే సూర్యుడు', 'నా దేశం నా ప్రజలు' 'గొరిల్లా'. మొదలైనవి పాఠకలోకాన్ని బాగా ఆకర్షించాయి.

ప్రాచీన ఆలంకారికుల నుంచీ నేటి విమర్శకుల వరకూ వస్తూన్న కావ్య సంప్రదాయాల్లో శబ్ద సంప్రదాయం, అర్థ సంప్రదాయం, శబ్దార్థోభయ సంప్రదాయం, ప్రాముఖ్యాన్ని వహించాయి. శేషేంద్ర కవితలు అర్థ సంప్రదాయ సంబంధులుగా కనిపిస్తాయి. "జీవితపు కోరలతో పోరాడి పోరాడి నా సంధులు సమాసాలు సడలిపొయ్యాయి. భాష సగం చచ్చి భావాన్ని మాత్రమే కళ్ళలో నిలుపుకో ఉంది" అని శేషేంద్ర అనడం ఈ విషయాన్నే వ్యక్తం చేస్తోంది. వీరి ప్రేమలేఖలు అపరూపమైన 'చంపూప్రబంధం', 'ప్రేమలేఖలు' లోని ఈయన కవిత్వమంతా ఆధునికమైన ఆత్మాశ్రయ ధోరణిలోనే సాగిన రచన. స్వకీయ అనుభవాలే ఇందులో చోటు చేసుకున్నాయి ఈ కావ్యం నిండా ఎన్నో రమణీయమైన సుందరదృశ్యాలు సాక్షాత్కరిస్తాయి.

ఈ కావ్యంలోని విషయాల్లో చాలాభాగం ఆయన ప్రేయసికి వ్రాసిన ప్రేమలేఖల్లోంచి స్వీకరించబడినట్లు పేర్కొనబడింది. అంతేగాక "........నా ఉచ్ఛ్వాస, నిశ్వాసాల రూపాంతరాలైన నా కవితలన్నీ ఒక్క హృదయం ద్రవించడానికే పాడుతున్నాను. ఒక్క ముఖంలో చిరునవ్వు పల్లవించడానికే అల్లుతున్నాను" అని నిక్కచ్చిగా చెప్తున్నారు. ఇదే ఈయన కావ్య ప్రయోజనం. ఇక్కడ ఒక విషయం గమనించాలి. ఈయన ఈ రచనలు ప్రేయసిని సంతోషపెట్టడంకోసం రచించబడ్డవే అయినా ప్రతి ప్రేమికుడి, ప్రేయసి గుండెలను తాకి వారిని ఆనందంలో ముంచెత్తగలవు.

ప్రేమ భావం అన్ని భావాలకన్నా ఉత్తమమైంది అన్నది ఈయన ఆశయం. అందుకే మనసునే ప్రమాణంగా స్వీకరించి అది అనుభవించిన ఆనందాన్ని, దుఃఖాన్ని కవితాబద్ధంచేయడం తన ధ్యేయంగా స్వీకరించారు. ఎన్నో తీయనైన అనుభూతుల పుష్పగుచ్ఛాలు ఈయన కవితా జగత్తులో కుసుమించి ప్రేమ సువాసనల్ని వెదజల్లాయి.

కావ్య నిర్మాణంలో ఊహాబలంకన్నా ఆత్మానుభూతి బలమే అధిక్యం అన్న విషయాన్ని ఈయన కావ్య సమార్గంగా స్వీకరించారు. అందుకే 'క్రియనూ ఊహనూ ఐక్యం చెయ్యడమే జీవన ధర్మంగా ఊపిరి పీల్చే కవి గుంటూరు శేషేంద్ర శర్మ" అని పీఠికలో పేర్కొన్నారు.

శేషేంద్ర శర్మ తన అనుభవ మాధుర్యాలను రమణీయ దృశ్యరూపంలో సాక్షాత్కరింపజేయ గల స్రష్ట. తాను తిరిగిన ప్రదేశాలూ, చూచిన సుందర దృశ్యాలూ పఠిత మనోఫలకంపై కుంచెతో చిత్రించే చిత్రకారునిలా ఈయన దర్శనమిస్తారు కవిత్వంనిండా. ఇలాంటి స్థితి మాధుర్యాన్ని చిలకరించేప్పుడే కాకుండా బాధని వ్యక్తం చెయ్యటంలో కూడా సిద్ధించడం ఆయన ప్రత్యేకత.

ఈ 'చంపూ ప్రబంధం'లో వెన్నెల వింతపోకడల్ని పోయింది. చంద్రుడు క్రొత్త వలువల్ని ధరించాడు. ఉపాలంభనకు ఆలవాలమైన చంద్రుడు, ఆకాశంలో ఒంటరి ఒంటెలా పడువున్న చంద్రుడు, చైనా బజారులో హారికెన్ లాంతరులా వ్రేలాడే చంద్రుడు, ప్లేటులో ఇడ్లీముక్కలా భాసించే చంద్రుడు, కాగే నూనెలో అప్పడంలా వుండే చంద్రుడు ఈయనదృష్టికి క్రొత్తగా అగుపించాడు. "ఒకప్పుడు ఒక మిణుగురు పురుగు కాంతిలోనీ కన్నీరు చూచి ఘనీభవించిన నా స్వప్నాన్ని ఆకాశపు అరచేతిల్లో పెట్టాను అదే ఈనాడు ఒక చంద్ర ఖండమై వంచిన వెండి రేకులా గాలిలో తేలుతుంది" అనడం ఈయన భావచాలనానికి నిదర్శనం. అంతేకాకుండా తారల గ్రామాల్లోని వెన్నెల మందలు తోలుకొచ్చిన మధురగానం, బ్రహ్మాండమైన నక్షత్రాల ఊరేగింపులో వెన్నెల జండా పుచ్చుకొని చంద్రుడు ముందునడుస్తూ కనిపించాడు. ఇంకా ప్రేమికుల నిద్ర పాడుచేసే మంచుముక్కలా భాసించాడు

ఈయనికి జగమంతా ప్రేమమయంగానూ, సృష్టి సర్వమూ ప్రేమికుల విహార తీరంగానూ సృజింప బడినట్లు తోచింది. ఋషుల ప్రతిపాదనలు కంటకప్రాయాలయ్యాయి.

"ఎవడో ఋషిచెప్పాడని ఎందుకుతుంచేస్తావ్ ప్రేమని, నీ రక్తం పారబోసి నింపుకోకు కమండలజలం" అని అనడంలో ప్రేమపై ఈయనకున్న మక్కువ, విరక్తిపై ఈయనకున్న ద్వేషం వెల్లడి చేయబడ్డాయి. ఋషుల మాటలకి లొంగిపోయి సన్యసించి శరీరంలోని రక్తాన్ని పారబోసి కమండల జలంతో నింపుకోవడం అవివేకం అనీ, నిష్ప్రయోజనమనీ, సంతోషంగా ప్రేమధారని గ్రోలుతూ జీవించడమే జీవిత పరమార్థం అని అభిప్రాయపడ్డాడు. కాబట్టే అలా అన్నాడు. ఇంతేకాక

"జీవిత మంటే ఏమిటిరా అని
గడ్డాన్నడగడ మెందుకురా
మధుమాసంలో మామిడికొమ్మను

గురించి బ్రాహ్మణ్నడక్కురా" అని చెప్తూ నన్నడుగు ఆకోకిల నడుగు అన్యులనడుగుట వ్యర్థమురా' అని అనగలిగాడు.

జీవితాన్ని కాచి వడబోసిన తాత్వికునిలా ఈ లోకంలో "మనిషి జీవితంలో సుఖాలకంటే దుఃఖాలే దొరుకుతా", యంటాడు. సుఖ,దుఃఖాలు పడుగుపేకల్లా అల్లుకుపోయిన అందమైన వస్త్రం ప్రేమ ఈ జగత్తులో ఓలలోడే జీవితమే ధన్యం అన్నది ఈయన భావం. అందుకే "ఈ విశాల ప్రపంచం అంతా ఒక్క

పురుషుడు ఒక్క స్త్రీకోసమే సృష్టించ బడిందని నమ్ముతా'' రీయన.

ప్రేమకోసం ఎంతబాధనయినా పడదగినంత విలువుంది అనడం ఈయన ప్రేమ పిపాసతని వ్యక్తంచేస్తుంది. అంతేగాక తనని అహర్నిశలూ వేధించే కీర్తి స్వప్నాలన్నింటినీ ఆమెకోసం, ఆమె ప్రేమకోసం రద్దు చేసుకోగలననడం గానీ, ఆ “ఒక్క గమ్యంకోసం తక్కిన ప్రయాణాలన్నీ త్యాగం చేసుకుంటా'' ననడం గానీ ఆయన ప్రేమ తత్వాన్ని వ్యక్తంచేస్తాయి.

ఈయన ప్రేయసి ఒక పెద్ద ఆఫ్రికా ఖండంలో కూర్చుంటుంది నిబ్బరంగా. ఆకాశం దాటిపోతున్న చంద్రుణ్ణికూడా ఆజ్ఞాపిస్తుంది, అక్కడే ఆగమని. పర్వతాన్నికూడా ఇలా రా అని ఉత్తర్వుచేస్తుంది; ఒక వేలితో. ఆమె స్త్రీ కాదు అందాల తుఫాను. చీరా తారా కలిపి నేసిన రూపం ఆమెది. ఆమె చేతులు పువ్వుల దండలు. ఆమె నవ్వులు నక్షత్రాల కండలు. ఆమె సౌందర్యంలో భాగంకాని నక్షత్రం కానీ, ఉషస్సు కానీ పువ్వు కానీ ఎక్కడా లేదు. అందుకే ఆ ప్రేయసి సాంగత్యంలో ''పెదవుల్లో పిల్లనగ్రోవులు పితుక్కుంటూ మసక మసక చీకటి క్షణాల్లో మాధుర్యం కొల్లగొట్టారు'' శేషేంద్ర. ఇంత మాధుర్యాన్ని ఆమెనుంచి పితుక్కున్నా తనివి తీరలేదు. చివరకు తన సర్వస్వాన్నీ ఆమెలో పోగొట్టుకున్నానంటూ– ''నా బాహువుల రేవులో నీవు నావలా ప్రవేశించినపుడు నీ కన్నుల నీలి ఆకాశాల్లో నా తెరచాప పోగొట్టుకుంటాననుకోలేదు'' అంటున్నాడు. నావకు తెరచాప సర్వస్వం. ఆ తెరచాప పోవడం సమస్తం పోవడం.

ప్రేయసి సాన్నిధ్యం ఈయనకు ఎంత ఆనందాన్నిచ్చిందో ఆమె ఎడబాటు గుండెల్లో అంత బాధని రగిల్చింది ఆయన మార్గాల్లో ఆమె విడిచిపోయిన అడుగులు ఆయన క్షణాలకు బంగారపు మంటలంటించాయి. ఆమె ఉన్నప్పుడు ఈయనపొందే సంతోషాన్ని, లేనప్పుడు అనుభవించే దుఃఖాన్ని గురించి చెప్తూ–

''నీవు ఉన్నప్పుడు వాలేదానివి నా గుండెమీద
ఒక దండలా
నీవు ఇప్పుడు లేవు
కానీ వాలుతున్నావు ఒక కొండలా'' అన్నాడు.

ఆమె ఉండి గుండెలమీద వాలితే ఏ దిగులూ వుండేది కాదు, ఎంత బరువైనా ఆమె బరువనిపించేది కాదు: కానీ ఆమె లేనప్పుడు ఆమె స్మృతుల రూపంలో అతి భారంగా దుఃఖాన్ని ఒక కొండలా ఆయనపై వాల్చింది. ఆమె ఆయనను విడిచి దూరంగా వెళ్ళితే ఆ ఎడబాటును సహించలేని స్థితిలో ''ఏదిగంతాల అవతలికి వెళ్ళావో నీ హంసలాంటి అడుగుల్ని ఏ దీవులకు అంకితం చేశావో'' 'అంటూ వాపోతూ', 'నాచేతిలో నీవొక నక్షత్రాల గుత్తిలా ఉండకపోతే నేనేమయిపోతాను' అని బాధపడ్డాడు; ఆమె ఎడబాటులో ఆయనకు ఆకాశం ఏమీ కాదు. సూర్య చంద్రులు నక్షత్రాలు కలిపిన శూన్యం అవుతుంది అంతే. ఆమె లేని శూన్యాన్నేదీ నింపలేదు లోకంలో.

ఇలా శేషేంద్ర కవిత కోమలమైన ప్రేమలోని తీయదనాన్ని వ్యక్తం చేయటమే కాక అందులోవున్న దుఃఖాన్నీ వెల్లడిచేసింది కొన్ని సందర్భాల్లో శృంగార భావాల్ని వ్యక్తీకరించే తీరు, ప్రబంధకవుల లేఖినుల్నుంచి జాల్వారిన శృంగారంతో స్నేహంచేసింది.

''తొడల్లో మిడిసిపడే చేపలు
ఒడిసి పట్టుకొంటూ
ఆ పెదవుల్లో పిల్లనగ్రోవులు
పితుక్కుంటూ

మసక చీకటి క్షణాల్లో మాధుర్యం కొల్లగొట్టాను' అనడం ఇందుకుదాహరణ. ఇక్కడ తొడల్లో మిడిసిపడే చేపల్ని ఒడిసిపట్టడం కొంచెం మోతాదు మించిన శృంగారమే మిగిలిన భాగమంతా రమణీయమైన కల్పన. పెదవుల్లో పిల్లనగ్రోవులు పితికటం మధురమైన భావన. పిల్లనగ్రోవి పెదవి వంటి పెట్టుకొని మధురమైన సంగీతాన్ని వినిపిస్తుంది. సంగీతమంత మాధుర్యాన్ని పెదవులనుంచి గ్రోలుతున్నాడు మసక మసక చీకటి క్షణాల్లో.

ఇంకా తన ప్రేమనుగూర్చి చెప్తూ – ఆ నులివెచ్చటి ఉరోజాల్నే ఆ మత్తెక్కించే శిరోజ సౌరభాల్నే 'ఆ రెండు తొడల్లోనుంచే నా ఆనంద బ్రహ్మం ఒడుక్కునేలా ప్రేమిస్తా' అనడంకానీ, 'నీ చన్నుల్లో దూరి చలికాచుకోనీ', అనడంలో కాని 'నీ ప్రేమ వించే

చాలు తన పాశాశంలో జలపాతం ఊరకని ఊర్వశి, నీ రూపు చూస్తే చాలు కలల్లో చలించి స్ఖలించని మేనక మరే ప్రేమనాథర్లోనూ మనకు కనిపించదు' అనడం అంచులు దాటిన శృంగారానికి ఉదాహరణలే.

శబ్దార్థాలలో అర్థానికే ఎక్కువ ప్రాధాన్యం ఇచ్చిన శేషేంద్ర కవిత కొన్నిచోట్ల ప్రాసల ప్రమేయాన్ని కలిగి వుంది. ఈయన కవితలోని అనుప్రాసలు ప్రాసల కోసం సమకూర్చినకవిగా కాక వసంతంలోకి విచ్చేసిన కోయిలల్లా, చిలుకల్లో సహజంగా కనిపిస్తాయి.

'అది సూర్యుడి దరహాసం అది కొండలు ఇతిహాసం
అది పక్షుల మధుర సమాసం అది వృక్షాల
సమావేశం
అది నిశ్శబ్దాల ప్రవాసం
అది పువ్వుల చిరునామా అది సంధ్యాకాంతల
డ్రామా
అది ఋతువుల రాజీనామా అది బాధలకొక కామా'

పై పంక్తుల్లో 'అది' అన్న పదం పలుమార్లు ఆవృత్తమై అది అంతఃప్రాసల్ని వ్యక్తంచేస్తూంది. కాని ఇక్కడ ప్రాస ప్రాసకొరకు కాకుండా ఒక ప్రత్యేకత కోసం సమకూర్చబడింది. ఈ 'అది' అన్న పదం ఆవృత్తివల్ల పఠితకు ప్రకృతిలోని విశేషాల్ని వేలెత్తి చూపుతున్నట్లు స్ఫురింపజేస్తూ ఉంది 'చిరునామా', 'డ్రామా', 'రాజీనామా', 'కామా'లు కొంత రూప భేదంతో ప్రయోగింపబడిన పదాల ఆవృత్తిని వ్యక్తం చేస్తున్నాయి.

'వాదాలకు అనువాదాలకు నీవొక్కడివే గతిశేషేన్
భాషాంతర వర్ణాంతర అత్మకళే నీ అక్షర యాత్ర'

కూడా ఇటువంటిదే.

శేషేంద్ర 'ప్రేమలేఖల్లో' సంస్కృత పద బాహుళ్యం కానీ, దీర్ఘసమాసఘటన కానీ ఎక్కడా కనిపించదు. ఈయన కవిత్వంలో, 'మిలియన్' 'డ్రామా' 'క్యాలెండర్' 'హీరో' వంటి ఆంగ్ల పదాలు, 'రాజీనామా', 'ఫలో', 'మజా', 'రాస్తా', 'దునియా', 'గుల్ మొహర్', 'జిందాబాద్', 'గిరఫ్తార్', 'భరోసా' వంటి ఉర్దూ పదాలు చోటుచేసుకున్నాయి.

'ప్రేమలేఖలు'లోనిభావాలన్నీ శేషేంద్ర ప్రత్యేకతని వ్యక్తంచేస్తాయి. అందమయిన దృశ్య భావాలు గుంపులు గుంపులుగా అయని కవిత్వం నిండా దర్శనమిస్తాయి. అవి వెల్లడి చేయబడిన తీరు విలక్షణంగా వుంటుంది. 'వంతెనమీద కూర్చుని నామీద చంద్రుడి చేత వెన్నెల కురిపించుకొంటున్నా పారిపోతూన్న ప్రవాహాన్ని చూస్తూ' అనడంగానీ, 'ఆకాశంలో శిథిలాల్లో పడివున్న మేఘాల్లోనుంచి సూర్యమండలం లేస్తోంది, అనడంగానీ అయన భావుకతని ప్రకటిస్తాయి. ఆ భావుకతని అందుకోవడం కోసం ఆనందించడంకోసం వాక్యాలు తీగలుగా బిగించి తన్మొక వాద్యాన్ని చేసుకొని మన ముందుంచుతున్నాడు.

ఇంతేకాక 'ఒక స్వప్నంకోసం మొత్తం జీవితపు అగ్ని ముద్దనంతా పట్టుకున్నాను' అనడంగానీ, 'ఈ తామర మొగ్గలాంటి అరచేతి పీపుని నా పెదవులదగ్గరే ఉండనీ' అనడంగానీ, 'నా రెండు కన్నుల్లించీ స్వర్గాలు కారుతున్నాయి' అనడంగానీ ఈయన భావచాలనానికి నిదర్శనాలు. ఇందులో 'ఎన్నో పూల పరిమళాలు, ఎన్నో సంధ్యల కావి రంగులు, పక్షుల రాగాలు, ఎగిరిపోయే మేఘాలూ, మూర్ఛబోయే ఆకాశాలు, వేదనలననుభవించే వేణువులు, షహనాయిలూ, కరిగిపోయే అకలుషిత హృదయాలు, హద్దులేని భూగోళాలు అంతరిక్షాలకు ప్రాకే ద్రాక్ష తీగెలు ఇలా ఎన్నో' భావ చిత్రాలు కనిపిస్తాయి.

యస్. జి. డి. చంద్రశేఖర్
తెలుగు లెక్చరర్
యస్. వి. యూనివర్సిటీ కాలేజి
తిరుపతి-517502.

* * * *




## బుద్ధ దేవ బోస్

ఆంగ్ల మూలం అలోక్‌రంజన్ దాస్ గుప్తా

అనువాదం : అవంత్స సోమసుందర్

ప్రచురణ : సాహిత్య అకాడమీ, కొత్త ఢిల్లీ,
పుటలు 104, వెల 4-00 రు.లు

సాహిత్య అకాడమీ "భారతీయ సాహిత్య నిర్మాతలు" శీర్షికలో వెలువరించిన గ్రంథాలలో ఇది ఒకటి.

టాగూరు తర్వాత నిర్వివాదంగా పరిగణించ వలసిన వ్యక్తి బుద్ధదేవ్! కాని సాహిత్య అకాడమీ ప్రచురించిన ఈ గ్రంథం కవరు పేజీ మీద అలోక్ రంజన్ దాస్ గుప్తాకు బదులు "అలోక్ రంజదాస్ గుప్తా" అని ముద్రించారు అదే విధంగా జాకెట్ లోపలి వైపు బోలెడన్ని తప్పులు దొర్లాయి 'సత్యజిత్ రే ముఖ చిత్రం" అని ప్రచురించారు. కాని పేరుకు తగ్గట్లుగా ముద్రించలేదు. చూడగానే కొట్టి వచ్చేట్లు కన్పించే ఈ తప్పులు గ్రంథ గౌరవాన్ని తగ్గించి వేస్తాయి. సాహిత్య అకాడమీ ముందు ముందు మరింత బాధ్యతాయుతంగా తెలుగు ప్రచురణలు చేస్తుందన్న విశ్వాసంతో ఈ మాటలు వ్రాయాల్సి వస్తోంది.

"ఉత్తమాభిరుచీ, పరిపక్వ బుద్ధీ కలిగిన పాఠకులు లభించేంత వరకు వారి కోసం నిరీక్షించడం రచయితకేం బాధాకర విషయం కాదు. సాహిత్య కృషి ఫలించినట్లే" అని బుద్ధదేవ్ బోస్ ముందే అన్నాడు.

బుద్ధదేవ్ బోస్ ఎత్తైన కళా హృదయుడో అంత అధికంగా ఉత్పత్తి చేసినవాడూ, అత్యధిక ఉత్పత్తి చేసిన కళాకారుడు. అతని మీద మొదటి నుండి ఎన్నో అపప్రథలు వచ్చాయి.

బుద్ధదేవబోసు జీవితంలో ఎన్నో విచిత్ర సంఘటనలు జరిగాయి. 1970లో కలకత్తా కోర్టు అశ్లీల సాహిత్యం సృష్టిస్తున్నాడన్న అభియోగంపై 70 రోజులు విచారణ జరిపి శిక్ష విధించింది అదే రోజు కేంద్ర ప్రభుత్వం 'పద్మభూషణ్' బిరుదు ఇవ్వబోతున్నట్లు ప్రకటించింది.

శక్తివంతులకు అడుగడుగునా వైరుధ్యాలు ఎదురవడం సహజమే. అతను స్పృశించి విజయం సాధించని ప్రక్రియ ఏదీ లేదు. కావ్యాలు, నవలలు, వ్యాసాలు, విమర్శలు, నాటకాలు, పద్యాలు, గాథలు- ఎన్నో వ్రాశాడు.

'బందీర్ బందనా' అనే కావ్యం ద్వారా అతని తిరుగుబాటు ధోరణి వ్యక్తమవుతుంది. దేహం, ఆత్మల సమ్యక్ స్వరూపమే జీవితం అని తత్త్వం.

1941లో మరణించిన ముగ్గురు ప్రపంచ ప్రసిద్ధ రచయితల ప్రభావం బుద్ధదేవ బోస్‌పై గాఢంగా హత్తుకుపోయింది. వారు రవీంద్రనాథ టాగూరు, జేమ్స్ జాయిస్, వర్జినియా వూల్ఫ్..

1948లో తన కవితల్ని 'ద్రౌపది చీరలు' పేరుతో వెలువరించాడు. వంగ కవిత్వానికి శృంఖలా విచ్ఛేదం కలిగించాడు. కనుకనే సంప్రదాయ భాషారీతిని బుద్ధిపూర్వకంగా భగ్నం చేయక తప్పలేదు. ఎజ్రా

పౌండ్ ప్రకటించిన ఇమేజిస్టు మేనిఫెస్టోను అతడు పూర్తిగా అనుసరించాడు.

మాటల్ని పేర్చి పద్యాన్ని వ్రాయడం ఒక లోటు అని విమర్శకులు అంటూంటారు. కాని కవితను ప్రయోగించే పదాల అంతఃశక్తిని వివిధ కోణాలలో పరిశీలిస్తాడనీ, వాటి విలువలు అంచనా వేస్తాడనీ కవితా రచనపట్ల అనుభవంలేని వారు సొట్ట విమర్శలు చేస్తారనీ అలోక్ రంజన్ అభిప్రాయం.

జె అంధార్ ఆలోక్ అధిక్ (1958) అనే కావ్యం బుద్ధదేవ్ కృతుల్లో అత్యుత్తమమైనది.

'సమర్పణ' అనే కావ్యం నుండి ఒక భాగాన్ని అనువదిస్తూ- పై అనువాదంలో మూలంలోని సౌంద ర్యంలో లవలేశమే ఆవిష్కరింప గలిగినట్లు రచయిత పేర్కొన్నాడు. మూల రచనలో బుద్ధదేవ్ ఎన్నో గడుసరి శ్లోకలు చేశాడనీ, ఖండిత పాదాల అంత్య ప్రాసలు, పాదమధ్యంలోని అనుప్రాసాది శాబ్దిక సౌందర్యాలూ, మరో భాషకి వచ్చినా ఎక్కి రావనీ, మూల రచయితకు విధేయమైన పదచిత్రాలు భాషాంత రీకరణలో అసలు స్వరూపాన్నే కోల్పోయే అవకాశా లున్నవనీ అలోక్ రంజన్ అంటున్నాడు,

మంచి కవిత ఒక మంచు బిందువు వంటిదనీ, దానికి సర్వసమగ్ర స్వరూపం ఉంటుందనీ, అయితే దానికెన్నటికీ జన్మబంధాల గురించిన స్పృహ ఉండ దనీ, ఏ కళా స్వరూపంగాని పరిపూర్ణంగా కళాకారుని అంతశ్చైతన్యం నుంచి విడిపోవడం సంభవించదనీ, అలాగని ఏ కళాకారుడు గాని స్వీయ జీవన పద్మ వ్యూహం నుంచి పూర్తిగా పలాయనం చెందలేడు. 'జె అంధార్ ఆలోక్ అధిక్' కావ్యానికి ఇతివృత్తంగా కవితా వ్యక్తిత్వానికీ, కర్మానుబంధమైన పంచభూతా త్మక కృషికీ మధ్య విజృంభించే సంఘర్షణను స్వీక రించాడు.

1961లో బుద్ధదేవ్ "చార్లెస్ బోదలేర్ - అతని కవిత్వము" అనే గ్రంథాన్ని, 1970లో రైనర్ మేరియా రిల్కే కవితా వైభవం అనే గ్రంథాన్ని ప్రచురించాడు. 1957లో "కాళిదాసేర్ మేఘదూత్" అచ్చయింది. "ఉత్తర మేఘంలో కాళిదాసుని వలెనే మరింత పరిపక్వత సాధించాడు. మూల కవితలో అనువాదకుడు రసభావసమన్వయత పొంది తాదాత్మ్య స్థితి అనుభవించడమే ఇందుకు కారణం.

బుద్ధదేవుని దృష్టిలో కళాకారుడు ఐంద్రజాలికుడే. కనుకనే కళాకారుడు తాను లోకం నుంచి పరిగ్రహిం చిన సామాన్యవస్తువును తన కవితా మంత్రోచ్చాటనతో విశేషార్థ స్ఫోరకంగా భాసింపజేస్తాడు.

నిరంతరంగా 30 సంవత్సరాల పాటు బుద్ధదేవ్ టాగోర్‌పై విమర్శ చేస్తూ వచ్చాడు.

"ఈ విశాల విశ్వం ఏ వొక్కడి తాత ముల్లె కాదు. సర్వ సామాన్య భావంలో కాక ప్రపంచం పట్ల మరే అభిప్రాయం కలిగిన వాడైనా ఉత్త పల్లెటూరు బుద్ధాయి క్రింద లెక్క. అదేవిధంగా సాహిత్యంకూడా నా తాతలు గడించిన నిధి అనో లేక ఫలానా వాడి సొత్తు అనో భావించడం మన మూర్ఖత్వం"

1974లో బుద్ధదేవ్ మహా భారతేర్ కథ- ప్రచు రించాడు. ఇది సర్వోత్కృష్ట రచన అని అలోక్ అంటున్నాడు. మహాభారత కథనంపై ఇంతవరకూ వచ్చిన ఏ విమర్శకులకూ అందని విషయాలని బుద్ధదేవ్ ప్రస్తావించాడు.

రచయిత శైలి ప్రభుసమ్మితంగా ఉండకూడదు. ఆహ్లాదకర భాషణంవలె రచన సాగాలి. సుహృత్ సమ్మితమై గాని, కాంతా సమ్మితమై గాని శైలి ఉండడమే బుద్ధదేవునికి ఇష్టం.

భారతీయ భాషలన్నిటినీ సంప్రదాయక వైయా కరణుల సంకెళ్ళ నుండి ఉద్ధరించదలిచాడు బుద్ధదేవ్. భాషను సతత సంచలనాత్మకం చేయాలనీ, తక్కువ పరిమితిలో ఎక్కువ శక్తిని సంఘటింపచేయాలనీ, వాడకంలో నలిగిపోయిన మాటలకు వినూత్న శక్తి

అయత్తపరచాలనీ బుద్ధదేవ్ ఆచరణాత్మకంగా ప్రయత్నించాడు.

బుద్ధదేవ్ అక్షరాలా శతాధిక గ్రంథకర్త. నిస్సంగుడనీ, వ్యక్తివాది అనీ అంటారు. అతని కృతులలో అమేయ మౌలిక గుణం కన్పిస్తుంది. ప్రతిభా పాటంగతమైన సృజనశక్తితో అతని సాహిత్యం తేజోవంతమైంది. ఏ సాహిత్య ప్రక్రియను బుద్ధదేవ్ వదలలేదు. 66 ఏళ్ళ జీవితంలో ప్రతి నిమిషమూ సాహిత్యం కోసమే అంకితం చేశాడు బుద్ధదేవ్.

అనువాదం మరింత సాఫీగా సాగి ఉంటే ఎక్కువ మంది తెలుగు పాఠకులు చదివేవారు ఈ గ్రంథాన్ని.

—వి. యస్. హరినారాయణ్

# మధుజ్వాల

రచన :—జ్యోతిరాణి

కిన్నెర 'పబ్లికేషన్స్-సెంట్రల్ ఎక్సైజ్ కాలనీ' హైదరాబాద్—వెల రూ/ 10-00 లు

తిమిరాలను తరిమే ఇనకిరణంగా తేజోమయ ప్రభాత పుంజంగా ప్రమిదల్లో ప్రమిదగా కారుచీకట్లను తరుముతూ విజయశంఖం పూరిస్తున్న రచయిత్రి జ్యోతిరాణి. చెట్లు నరకగూడదనే నేటి నినాదాన్ని ప్రబోధిస్తున్న కవిత "భస్మబీజాలు". శిల మీద శిల్పి మీద కవిత బాగుంది. భావికోసం బాధపడని ఆత్మబలం కావాలని కోరుకుంటున్నది. కలవారికి లేనివారికి అనురాగబంధం వేయనా అంటుంది. అది జరిగే సమస్యయేనా. సంపన్నుడికి-పేదవాడికి ఉన్న అంతరం ఇప్పట్లో సమసేదికాదు. రెండూ భిన్న ధ్రువాలే. కనీసం తన కవితను కష్టజీవుల బాధాగాథల కొరకైనా వినియోగించాలనే తపన "నేను" అన్న కథలో కన్పిస్తుంది. కష్టజీవుల కళ్లల్లో రేపటి ఆశనై వెలుగనా. శ్రమ జీవుల కండల్లో తరగని బలమై దాగనా-"ఇక్కడ కవిత కుండవలసిన బలం వుంది.

61 కవితలతో ఉన్న పుస్తకానికి కొన్ని పేజీల బలాన్నిస్తే కొన్ని పేజీలు బరువును యిచ్చాయి. సామాన్య మానవుని ఆర్థిక దుస్థితిని అసహాయతను ఆలంబనంగా చేసికొని వ్రాయబడిన కవిత "ఏమని పొగడాలి". కలంతో, గళంతో సామాన్య మానవునికి అండగా వుండేందుకు సహకరిస్తుంది 'వీర వియత్నాం—వేదు నిజాలు' మళ్ళీ మళ్ళీ చదివించేలా వున్నాయి.

చిట్టి చినుకురాలితే నవభావం పంచినట్లు-మోసాల ముసుగులు జారిపోయేటట్లు—వర్ణ భేదాలు చితికి చితికి పోయేటట్లు ఒక వర్షం కురవాలి ధరణి హర్షం పొందాలి. చాలా చక్కటి భావన. కల్మషాన్ని క్షాళనంచేసే వర్షం వస్తే ఎంత మంచిది—ఎవరు హర్షించారు. మెట్ట పల్లాలను సమం చేయాలి. ఇది సమ సమాజ స్థాపనకు ధ్వని. పాపా, గడ్డిపూవు; నేనెవరిని స్వానుభవంతో రాసిన గేయాలు. ప్రతి గీతంలో ఏదో మధువును ఉంచాలని ఆ మధువుతోబాటు సగటు మానవుని బాధలను కూడ అందించింది రచయిత్రి జ్యోతిరాణి భావపూరితమైన ఈ కవితలు తెలుగు సాహితిలోకొన్నిఆకట్టుకోవచ్చు.

ఈ కవితలకు ఆస్థాన కవి డా॥ దశరథి గారి ప్రశంస లభించింది.

మానవతా సహాయ మందిరస్థాపకులు శ్రీ పండిత ఫకీర్‌చంద్ మహారాజ్‌గారికి ఈ పుస్తకం అంకితం చేయబడింది.

సామాన్య పాఠకునికి ధర అందుబాటులో లేదు.

ఎస్. రామానుజా చార్యులు

## మనకు మనకి వేదనావేష్టితము

ఓరియన్ పబ్లికేషన్స్
124. జి. యస్. మాడాస్ట్రీట్
తిరుపతి : 517501.

ఏ ఖండికలు లేని లఘుకావ్యం. శీర్షికలు లేవు. నవ్య సమాజ పరిశీలన, అంతర్వాహినిగా కవితలో ప్రవహిస్తూంది. వచన కవిత పరిణామంలో యిప్పుడు విశ్వరూపం ధరించింది ఈ తరుణంలో వస్తునిర్దిష్ట మైనా కాకున్నా సమాజ శ్రేయస్సు ఈ కవితలో వుంది.

పూలను పలచిన బ్రతుకులకు బూడిదే మిగులు తుంది. ఆ బూడిద గూడ గాలికెగెరిపోతుంది. మనకు మిగలేద వేదనయే అంటాడు కవి కే. ఎస్. కవికి అభ్యుదయంపై ఆశ ఎక్కువ. పులకింతలు ఉప్పతిని వాన మీటుతున్న రాత్రివేళకి బ్రతుకంతా స్పందించనీ అంటాడు .నిజాల ఖనిజం నుంచి ఇంత దయాసు వర్ణం తీసివ్వమంటాడు. అనుభవాల బేంక్ నుంచి కొంచెం ఉపశాంతిని ఎరువివ్వమంటాడు. మతాల మతాబాలు ఇజాల నకిలీ నిజాలు అసలే వద్దంటాడు. నిజంగా ఏదీ పూర్ణ మానవుడు-అని ఆవేదన చెందు తాడు.

అభ్యుదయమే పరమావధిగా గల యువతను నవ్య మార్గం వైపే పయనించాలనీ ఎందుకని - ఎందా కని అడగకుండ వెను దిరిగి చూడని ప్రయాణం చేయాలని నిర్దేశిస్తాడు. అతని దృష్టిలో గతం మృతం. అంతే కదా వర్తమానం అమృతమైనపుడు.

ఈ వేపపూత వాసనలోంచి సింధు నాగరికత దినాల్లో నూతిగట్టున నవ్వా నేను - చిటికెడు సాహ సంతో వశ్యమైపోయింది బ్రతుకు పులుసువంటి కొన్ని వాక్యాలు, ఏ భావాన్ని అర్థాన్ని అందించడం లేదు. భారతి జనవరి 80 సంచిక నుండి పునర్ముద్రితము- 20 చిన్న పేజీల ఈ కవిత వెల రూ 6/- లు.

ఎస్. రామానుజా చార్యులు

## సువర్ణభాషితాలు

రచన : శ్రీ తాడి వెంకట కృష్ణారావు
ప్రచురణ : శశిశ్రీ పబ్లికేషన్స్
హుమాయున్‌నగర్
హైదరాబాద్ - 500028.

అన్నిటికంటె సులభమైనది నీతులు వల్లించడం. శుక్రుడు ప్రత్యేకంగా నీతి కోవిదుడు. విదురుడు నీతులు చెప్పినవాడే. భర్తృహరి సుభాషితాలు చెప్ప నక్కర లేదు.

మౌలికమైన సత్యాలు కొన్ని. అనుభవ పూర్వక మైనవి కొన్ని-అనుశ్రుతంగా వస్తూన్నవి కొన్ని. అలా చెప్పిన వన్ని నిత్య సత్యాలు. పదే పదే యిలాంటి సత్యాలు వల్లించడంవల్ల మానవుల దైనందిన జీవ నంలో కొంతైనా నైతిక మార్పు కల్గడం సహజం.

తాడి వెంకట కృష్ణారావు సంకలనం చేసిన సుభాషి తాలు అందరికీ అర్థమయ్యే రీతిలో సులభ వచనంలో రాశారు. ఎక్కువగా దైవపరమైనవి. ఆధ్యాత్మికమై నవి ఉండడం వల్ల ఇతడు ఆస్తికుడని చెప్పవచ్చు. కొన్ని ముత్యాల వంటి సూక్తులు యీ సూక్తి మణి హారంలో భాసిస్తూన్నవి.

పతిత భావనా లోకాన్ని వికసింపజేసి సన్మార్గ నిర్దేశకంగా యిందలి సుభాషితాలు సంకలనం చేయ డం వల్ల బాల బాలికలకు ఆమోద యోగ్యంగా వున్నవి.

సత్ప్రవర్తన-సచ్ఛీలం. ఉత్తేజంగా కలిగించే లక్ష ణాన్ని యిందులో పొందిగారు కూర్చారి.

ఎస్. రామానుజా చార్యులు

# వార్తావాహిని

# హిందీ ప్రమాణపత్ర వితరణోత్సవములు

## సీతాఫల్‌మండి — సికిందరాబాద్

15th August రోజున రైల్వే ఉన్నత పాఠశాలలో చదువుచున్న బాలబాలికలు 50 మందికి పైగా హిందీ పరిచయ, ప్రాథమిక, మధ్యమ, రాష్ట్రభాష పరీక్షలలో ఉత్తీర్ణులైన వారికి శ్రీ ఎ. నాథన్ గారు రివిజనల్ పర్సనల్ ఆఫీసరుగారు, దక్షిణ రైల్వే (M.G.)గారు ముఖ్య అతిథిగా వచ్చిరి. జండా ఎగురవేసిరి. తర్వాత ఆయన పిల్లల చదువులను గూర్చి మాట్లాడినారు. శ్రీ నాథన్‌గారు, రైల్వే ఉన్నత పాఠశాల ప్రధానోపాధ్యాయులు శ్రీ సిలాక్‌ఖాన్‌గారు, శ్రీమతి రసవిహారిణి టీచరుగారు, వినోలియా విజయ కుమారి టీచరుగారు, కుర్చీలలో ఆసీనులైనారు. శ్రీమతి రసవిహారిణిగారు సర్టిఫికెట్లు పొందిన వారి పేర్లను మైక్‌లో చదువగా వారు వచ్చి, శ్రీ నాథన్ గారి చేతికి, తెన్నేటి సుందరమ్మ హిందీ పండిత్ సర్టిఫికెట్లను ఈయగా, ఆయన చేత పిల్లలకు బహూకరించిరి. ఆనాటి సాంస్కృతిక కార్యక్రమాలు నృత్య, నాటిక ప్రదర్శనలు ప్రదర్శించిరి. చివరగా ఉప ప్రధానోపాధ్యాయులు శ్రీ పరమేశంగారు ఆనాటి కార్యక్రమానికి తోడ్పడిన వారికి కృతజ్ఞతలు తెలియజేసారు. జాతీయగీతంతో సభ ముగిసింది. పిల్లలకు మిఠాయలు పంచిపెట్ట బడెను.

## విజయనగరం

స్థానిక వాణి హిందీ విద్యాలయం రెవ ప్రమాణ పత్ర వితరణోత్సవం వాణిజ్య భవనంలో ఆగస్టు 27న ఎడిషనల్ సూపరింటెండెంట్ శ్రీ ఆల్‌ఫ్రెడ్ అధ్యక్షతన జరిగింది.

శాసన సభ్యులు శ్రీ పి. అశోక గజపతి రాజు గారు ముఖ్య అతిథిగా పాల్గొని హిందీ విద్యాలయం స్థాపించి బాలబాలికలకు హిందీ భాషాభిలాష కలిగించ దంలో ప్రచారకులు శ్రీ వై. అంజనేయులు చేస్తున్న కృషిని అభినందించి విద్యార్థులకు ప్రమాణపత్రాలు పంచిపెట్టారు.

తెలుగు లెక్చరర్ శ్రీ రామకుమారి ప్రసంగిస్తూ ప్రచారకులు శ్రీ అంజనేయులు జాతీయస్థాయిలో వెయిట్ లిఫ్టర్‌గా పేరుపొంది హిందీ సాహితీ నందన ఉద్యానవనంలో పరిమళాలు వెదజల్లే గులాబీలా వికసించడం మాత్రమే కాక చిన్నారి మనసుల్లో హిందీ భాషపట్ల మమకారాన్ని కలిగించటం ఆనందంగా ఉన్న దని తమ సహజ ధోరణిలో మధురంగా వివరించారు.

ఛాంబర్ ఆఫ్ కామర్స్ కార్యదర్శి శ్రీ గూడూరు సన్యాసిరాజు హిందీలో ప్రసంగించడం పిల్లలని ఆకర్షించింది. హిందీ విశిష్టతలని వివరిస్తూ దేశంలో ఏ ప్రాంతంలోనైనా వ్యవహారాన్ని కొనసాగించటానికి హిందీ ఆవశ్యకతని విపులీకరించారు. శ్రీ నరసింహా రావు ఆశీస్సులు తెలియజేశారు.

ప్రచారక్ శ్రీ వై. అంజనేయులు నివేదిక సమర్పించారు. అతిథులను వేదిక పైకి ఆహ్వానించి పరిచయ కార్యక్రమం నిర్వహించారు. కుమారి భారతి ప్రార్థనతో సభ రక్తి కట్టింది.

అనంతరం మహారాజ కళాశాల విద్యార్థిని కుమారి బి. రామలక్ష్మి వీణ కచేరి రసజ్ఞులని ఉర్రూత లూగించింది. కార్యక్రమానికి ప్రత్యేక ఆకర్షణ అని చెప్పవచ్చు. మృదంగంతో శ్రీ సుందరరామయ్య

సహకరించారు. జానపద గీతాలు వీణపై ఆమె పలి కించిన తీరు అభినందనీయం.

కుమారి వి.కె. లక్ష్మి వందనసమర్పణతో సదస్సు జయప్రదంగా ముగిసింది.

## బొంతల కొడూరు

8-12-82వ తేదీ సాయంకాలం 3-30 గం.లకు జిల్లా పరిషత్ హైస్కూలు బొంతల కోడూరులో ప్రధానోపాధ్యాయులు, హిందీ పండితులు, బి. ఉమా మహేశ్వరరావుగారి అధ్యక్షతన పురప్రముఖులతోను, విద్యార్థినీ-విద్యార్థులతోను సభ గావించిరి. పదవ తరగతి విద్యార్థినులు పద్మ, కాంత, లక్ష్మి ప్రార్థన చేశారు. ప్రముఖ గాంధేయవాది, ఖాదీ గ్రామ స్వరాజ్య సంఘ అధ్యక్షులు 90 సం॥ల వయోవృద్ధులు మల్లె మడుగుల కోదండరామ స్వామిగారిచే హిందీ ప్రాథమిక, మధ్యమ. రాష్ట్ర ప్రమాణ పత్రములు వితరణోత్సవము జరుపబడినది. శ్రీ కోదండ రామస్వామి గారు తమ పూర్వ అనుభవములను జోడిస్తూ హిందీ ఏల నేర్వాలో దాని ప్రాశస్త్యమును వ్యక్తీకరించారు. వారికి హిందీపై వున్న ప్రీతిని వక్కాణించారు. దక్షిణ, ఉత్తర ప్రాంతాలను హిందీ ఎట్లా అనుసంధానము గావిస్తుందో తెల్పిరి. మొదట సభకు శ్రీ బి. ఉమామహేశ్వరరావు హిందీ పండితులు, వారిని పరిచయం గావించారు. హిందీభాష నిమిత్తం వారు చేస్తున్న కృషిని ప్రముఖులు కొనియాడారు.

## ఆంధ్రప్రదేశ్ అవతరణ మహోత్సవము

ది. 1-11-82 న హిందీ ప్రచారక విద్యాలయము మాచవరంలో పై ఉత్సవము ఉత్సాహ పూరిత వాతావరణములో జరిగింది. అఖిల భారత స్వాతంత్ర్య సమరయోధుల సంఘ కార్యదర్శి శ్రీ వి. యల్. సుందరరావు ముఖ్య అతిథిగా పాల్గొన్నారు. ఆంధ్ర రాష్ట్ర కల్పన వందేమాతరమునకు పూర్వమే జరిగినప్పటికి 1913 నుండి నిర్మాణాత్మకంగా కృషి జరిగిందని చివరకు శ్రీ పొట్టి శ్రీరాములుగారి ఆత్మాహుతితో మనకు రాష్ట్రం ఏర్పడిందనీ వారు వివరిస్తూ భావితరాల వారికి మన స్వాతంత్ర్య చరిత్రను వివరించవలసిన బాధ్యత ప్రతి స్వాతంత్ర్య సమర యోధునిపైన ఉన్నదని వారు తమ ఉపన్యాసంలో తెల్పారు. ఆంధ్రప్రదేశ్ అవతరణకై కృషిచేసిన యోధులను స్మరించడమైనది. భారత స్వాతంత్ర్య వీరులందరికి జోహారు అర్పించారు. తొలుత వందేమాతరంతో సభ ప్రారంభమైనది. విద్యాలయ ప్రిన్సిపాలు సుబ్బారావుగారు కార్యక్రమాన్ని నడిపారు స్వాతంత్ర్య సమర యోధులైన సర్వశ్రీ మండా వేంకట కృష్ణారావు, గుత్తా రామమోహనరాయ నాగేశ్వరరావు, కృష్ణాజిల్లా సర్వోదయ మండలి కార్యదర్శి, శిరపు అప్పారావు ప్రభుతులు సభలో పాల్గొని తమ అమూల్యమైన సందేశాల నిచ్చారు కుమారి శ్యామల, రాజశేఖరులు వందన సమర్పణ చేసిన పిమ్మట రాష్ట్ర గానంతో సభ జయప్రదంగా ముగిసింది.

## పర్వతగిరి

స్థానిక జిల్లా పరిషత్తు సెకండరీ పాఠశాలయందు, స్వాతంత్ర్య దినోత్సవము ది॥ 15-8-8 రోజున, హిందీ ప్రమాణ పత్ర వితరణోత్సవము వైభవముగా జరుపబడినది;

గ్రామ సర్పంచు శ్రీ జగన్నాధరావుగారి అధ్యక్షతన సభ 'వందే మాతరం' ప్రార్థనా గీతముతో ప్రారంభ మైనది. హిందీ ప్రచారకులు శ్రీ పి. ప్రేమ్ కుమార్ గారు అతిథులకు స్వాగతము పలుకుచూ హిందీ భాషకు గల స్థానము, ప్రాముఖ్యత మరియు, హిందీయేతర ప్రాంతాలలో దీని ప్రచారము కొరకు జరుగుచున్న కృషిని వివరించిరి.

హైస్కూలు ప్రధానోపాధ్యాయులు శ్రీ రాఘవులు గారు; మరియు ప్రాథమిక పాఠశాల ప్రధానోపాధ్యాయులు శ్రీ కోదండపాణిగారు ఉపన్యసించిరి. వారు తమ ఉపన్యాసములో హిందీ భాష చాలా ముఖ్యమైన భాష, ఇది మన రాజ భాష, చాల సులభమైన భాష మరియు మాధుర్యమైన భాష అని పిల్లలకు తెలియజేసిరి.

శ్రీ జగన్నాధరావుగారు. విద్యార్థులు చేసిన కృషిని ప్రశంసిస్తూ, తేది: 28-2-82లో నిర్వహించబడిన పరీక్షలలో ఉత్తీర్ణులైన విద్యార్థులకు ప్రమాణ పత్రములను అందచేసిరి. మీరు తమ ఉపన్యాసములో ఇతర భాషలపై మనం శ్రద్ధ వహించి, ఎక్కువ కృషి చేయవలసి ఉంటుంది. మీరు ఎక్కువ సంఖ్యలో. పరీక్షలలో పాల్గొన్నట్లయితే ఇక్కడ చక్కని హిందీ వాతావరణము ఏర్పడుతుంది అని వక్కాణించిరి.

హిందీ ప్రచారకులు శ్రీ పి. ప్రేమ్‌కుమార్‌గారు. M.A. వందన సమర్పణ గావించిరి జాతీయ గీతముతో సభ ముగిసినది.

తదనంతరము, వచ్చిన అతిథులకు తేనీటి విందు, మరియు విద్యార్థులకు మిఠాయిలు పంచబడినవి.



శ్రీ టి. గిరిరాజులు, యస్.టి.ఓ. ద్రోణాచలం గారి పుత్రిక కుమారి తోమంద్ర సుచేతా లక్ష్మి, తన 14వ యేటనే దక్షిణ భారత హిందీ ప్రచార సభ, మద్రాసు వారిచే 1982 సెప్టెంబరు నందు నిర్వహింపబడిన రాష్ట్రభాష పరీక్ష, పామిడి కేంద్రము నుండి ఆంధ్ర ప్రదేశమందంతటికి సర్వ ప్రథమురాలుగా ఉత్తీర్ణురాలైనది. ప్రవంతి పక్షాన కుమారి సుచేతా లక్ష్మికి శుభాశీస్సులు.



ది. 26-9-82 న హిందీ ప్రేమీ మండలి, పాలకొల్లు వార్షికోత్సవ సందర్భమున తెలుగు ప్రబంధ కావ్యం మనుచరిత్రను హిందీలోనికి అనువదించిన శ్రీ వద్దిపర్తి చలపతిరావు గారిని సన్మానించిన సందర్భమున తీయబడిన ఛాయాచిత్రం. మండలి అధ్యక్షులు శ్రీ బొండాడ వెంకట్రాజుగుప్త గారు శ్రీ చలపతిరావు గారిని సన్మానిస్తున్నారు. మండలి కార్యదర్శి శ్రీ కాండూరి మల్లికార్జునరావుగారిని చిత్రము నందు చూడవచ్చును.



భీముని పట్టణమునందు 10-9-82 న సి.బి.యం. ఉన్నత పాఠశాల ప్రధానోపాధ్యాయులు శ్రీ పి. న్యూటన్‌గారి అధ్యక్షతన ప్రమాణ పత్ర వితరణోత్సవం జరుపబడినది. పురపాలక సంఘం కమీషనర్ శ్రీ సి. నాగరాజారావు గారు ప్రమాణ పత్రములను విద్యార్థులకు పంచిరి.





హిందీ ప్రచారక విద్యాలయం, విజయవాడనందు దక్షిణ భారత హిందీ ప్రచార సభ, మద్రాసు అధ్యక్షురాలు శ్రీమతి ఇందిరాగాంధీగారి జన్మదినోత్సవం జరుపబడినది. మొదటి చిత్రంలో ముఖ్య అతిథి శ్రీమతి సీతా కామరాజు విద్యార్థినీ విద్యార్థులకు సందేశమిస్తున్నారు.

రెండవ చిత్రమునందు విద్యాలయ విద్యార్థీ విద్యార్థినులను చూడవచ్చును.



ది 22-11-82న దేవరాపల్లి (విశాఖపట్టణం జిల్లా)లో హిందీ ప్రమాణపత్ర వితరణోత్సవము జరిగినది
సభ అధ్యక్షులు శ్రీ మంగళంపల్లి రామకృష్ణారావు యమ్.యస్.సి.బి.యడ్., ప్రిన్సిపాల్,
గవర్నమెంటు జూనియర్ కాలేజి, హిందీప్రచారకులు శ్రీ చందక సత్యనారాయణ
మరియువిద్యార్థినీ విద్యార్థులను పై చిత్రమునందు చూడవచ్చును.

Edited, Printed and Published by Ch. Subrahmanyam, on behalf of the B. D.Hindi
Prachar Sabha-Andhra, 959, Khairatabad, Hyderabad-500 004.
and Printed at Dakshina Bharat Press, Hyderabad-500 004.